# స్నేహం

— ఇచ్ఛాపురపు రామచంద్రం

'విజయ' అనుబంధ మాలికలో
వెలువడిన నలభై మూడవ నవల

విజయ
౪౦. ధనలక్ష్మీ కాలనీ
మద్రాసు-౨౬

విజయ అనుబంధం

'VIJAYA' SUPPLEMENT No: 50
NOVEMBER 1979
"SNEHAM"
By ICHAPURAPU RAMACHANDRAM

ముఖచిత్రం: గంగాధర్

వెల: చెల్లింపలేనిది

(ఇది 'విజయ' పత్రికతో పాఠకులకు
యివ్వబడిన అమూల్య కానుక)



ప్రింటర్స్:
విజయా గ్రాఫిక్స్,
210- ఆర్కాట్ రోడ్,
మద్రాసు-600 026.

2

# స్నేహం

— ఇచ్ఛాపురపు రామచంద్రం

"యు కెన్ గో!"

ఆ మాట వింటూనే త్రుళ్ళిపడ్డాడు హరిప్రసాద్.

అప్పుడేనా!—అన్నట్లు దీనంగా చూశాడు.

అంతేనా!—అన్నట్లు నీరసంగా, నిస్పృహగా, నిరాశగా చూశాడు. కాని—అతన్ని వాళ్ళెవరూ పట్టించుకోలేదు. మర మనుషుల్లా—తాము కేవలం తమ విద్యుక్త ధర్మాన్ని సక్రమంగా నిర్వర్తించామన్నట్లు—రాతి ముఖాలతో...ఏ భావాన్నీ ప్రతిఫలించని కన్నులతో మిగిలిపోయారు.

బంట్రోతు—స్వింగ్ డోర్ తెరచి పట్టుకున్నాడు త్వరగా వెళ్ళమన్నట్లు. హరిప్రసాద్‌కి అడుగు పడలేదు. ఆ గదినుంచి అంత త్వరగా అవతలకి వెళ్ళడం అతని కెంతమాత్రమూ యిష్టమున్నట్లు లేదు. తల్లినుంచి బలవంతంగా దూరం చేయబడుతున్న పిల్లవాడిలా ఉందతని మనస్థితి. ఆకలి తీర్చుకుందుకు అమ్మనద్దకు చేరుకునే పసివాడిలా—వెయ్యి ఆశలతో వచ్చాడతను యిక్కడికి. కాని జరిగినదీ, జరుగుతున్నదీ ఏమిటి?

అమ్మ పొమ్మంటుంది.

తాను ఆశలన్నీ నిలుపుకున్న యీ చల్లని తల్లి—దూరంగా వెళ్ళిపొమ్మంటూంది! అతనికి దుఃఖం వచ్చేస్తూంది. అతని కన్నీళ్ళకు సభ్యతా, నాగరికతా కలిసి ఆనకట్టలు వేస్తున్నాయి. దుఃఖాన్ని

గుండెలలోనూ, గొంతులోనూ దిగమ్రింగుకుని తప్పనిసరి అయి వెదుతున్నట్లు ఆ గది బయటకు నడిచాడు.

అది—విశాలమయిన హాలు.

అతను హాలులోకి అడుగుపెట్టేసరికి—ఒక్కసారిగా—వందలకొద్దీ కళ్ళు....

ఆత్రంగా ప్రశ్నలు....పలకరింపులు....

"ఎలా చేశారు?"

"ఏం అడిగారు?"

"సబ్జక్టు మీదా?"

"జనరల్ నాలెడ్జా?"

అంత దుఃఖంలోనూ....నిరాశలోనూ....అతనికి నవ్వు వచ్చింది....జాలి వేసింది—తనమీదా....వాళ్ళమీదా కూడా.

ఒక్కసారి అతను వెనక్కి తిరిగి తనను బలవంతంగా బయటకు గెంటిన ఆ గదివేపు చూశాడు క్షణంలో అతని మనసు నిండా రకరకాల భావ తరంగాలు చెలరేగాయి.

అది—ఆ గది—ఒక రణరంగం. కాకలు తీరిన యోధుల ముందు....క్రూరుల ముందు—అభ్యర్థి ఒక్కడూ ఎదురు నిలిచి పోరాడి—గెలవకోవాలి. అప్పుడే అతన్ని విజయలక్ష్మి....ఉద్యోగ లక్ష్మి వరిస్తుంది. అదో క్రూరమయిన చదరంగం. ఆ చదరంగంలో తామంతా పావులు. ఇన్ని వందల మందిలో పదిమందో పదిహేనుమందో చివరకి మిగులుతారు. వాళ్ళకే ఉద్యోగపు సింహాసనాలు మిగులుతాయి.

పోటీ! ఆ పందే పది పదిహేను పావులలోనూ తాముండాలని ప్రతివారికీ తాపత్రయం. కాని యీ ఆటలో గెలిచే అవకాశాలకంటే ఓడిపోయే ప్రమాదమే ఎక్కువని అందరికీ తెలిసిన చేదు నిజం. అయినా—ప్రయత్నంచేసి తీరుతారు. ఆఁ....ఔను. అది—మానవ సహజం. ఆశాపాశమే లేకపోతే మానవ జీవితం మరోలా ఉండి తీరేది. ప్రయత్నం- మానవ లక్షణం, కర్తవ్యం. తను—తన కర్తవ్యం నిర్వహించాడు. వేలమందితో వ్రాత పరీక్ష వ్రాసి—వందలమందితో మౌఖిక పరీక్షకు వచ్చాడు. వేలనుంచి వందలలోకి

రాగలిగాడు కాపీ—వందలలోంచి పదులలోకి—రాలేకపోయినట్లే! ఇంటర్వ్యూ జరిగిన తీరు చూశాక....యింకా తను ఎలా ఆశ పడగలడు?

ఎవరికీ ఏ ప్రశ్నకీ జవాబు చెప్పకుండా- చెప్పలేక భారంగా- మెల్లగా పెద్ద గేటు దాటాడు హరిప్రసాద్. ఒక్కసారి ఎందుకో ఆ బోర్డునీ, ఆఫీసు భవనాన్నీ చూడాలనిపించింది- చూశాడు.

ఇక్కడ తను ఉద్యోగం చేయగలనని ఆశపడ్డాడు. కలలు కన్నాడు. తీయగా ఊహించుకున్నాడు. ఈ కార్యాలయం తనని ఆహ్వానించి ఆదరిస్తుందనుకున్నాడు. తన జీవితానికీ తన వారి జీవితాలకీ శాశ్వతమయిన వెలుగుని ప్రసాదిస్తుందనుకున్నాడు. భ్రమ పడ్డాడు. ఔను—తన ఆశలన్నీ అడియాసలే. ఊహలన్నీ విరిహాలే. కలలన్నీ కలలే. అన్నీ భ్రమలే. ఏవీ సత్యం కావు. తనది-ఎండ మావి వెంట పరుగే అని యీ సారి నిరూపితమయిపోయాక—యిప్పుడిక ఏం చెయ్యాలి తను?

వాళ్ళు తనలాగే ఆశోపహతులు కాబోలు! ఓడిపోయిన యోధులే కాబోలు! గుండె మంటని మాటలలో క్రక్కుతున్నారు.

"ఈ తతంగం అంతా వొట్టి నాటకమూ బూటకమూ. ఉద్యోగాలెవరి కివ్వాలనేది మొదలే నిశ్చయం ఐపోయి ఉంటుంది. ఇదంతా కన్నీటి తుడుపు. మననీ పబ్లిక్‌నీ చేసే దగా-మోసం-కుట్ర."

"నిజమే! కాకపోతే ఏమిటి? మనం ఎన్నో పరీక్షలు వ్రాశాం, ఇంటర్వ్యూలకి వెళ్ళాం. అయినా వేసిన చోటనే ఉన్నాం. ఉద్యోగం రావాలంటే ఏ మినిస్టరుకో, ముద్దుల బావమరదయినా అయి ఉండాలి, పుష్కలంగా దక్షిణ అయినా సమర్పించుకోగలిగాలి ఉత్తరాయణమూ, దక్షిణాయనమూ--రెండూ లేని మనం—ఏ నాటికీ యింతే! ఉద్యోగ ప్రయత్నాలకు పెట్టే ఖర్చులో ఏ కిళ్ళీ కొట్టయినా తెరుచుకుంటే..."

ఉష్ణం ఉష్ణేన శీతలం. వజ్రం వజ్రేణ భిజ్యతే. ముల్లుని ముల్లే తీయగలదు. తనలాగే దగాపడిన ఆ సోదరుల మాటలు హరి ప్రసాద్ గుండెలని కొంచెం చల్లబరిచాయి. అతను కొంచెం మనిషయ్యాడు. వాళ్ళని పలకరించాలనుకొన్నాడు. కాని అప్పటికే వాళ్ళతన్ని దాటిపోయారు.

ఇంకేం చేయాలో అర్థం కాలేదతనికి.

తన ఊరు వెళ్ళే రైలు మరో రెండు గంటల్లో ఉంది. స్టేషన్‌కి నడిచి వెడితే అరగంట పడుతుంది. కాని యిలా ఓడిపోయి మళ్ళీ అక్కడికి చేరుకోడమేనా? ఆ వూరు, ఆ యిల్లు భయంవేసింది. అక్కడ గడిచిన ప్రతిరోజూ భయంకరంగా జ్ఞాపకాలలోకి వచ్చింది. వాటి నుంచి తప్పించుకుందుకు-అతను బలవంతంగా తన దృష్టిని రోడ్డు మీదకి ప్రసరించాడు.

ఆఫీసులు వదిలే వేళ.

బజారు కలకలలాడే సమయం.

పనులున్నవాళ్ళకీ లేనివాళ్ళకీ కూడా తీరిక టైము. రాస్తా కిట కిటలాడుతోంది. నడవసాగాడు-జనంలో తనూ ఒకడై.

ధ్యేయం లేని నడక. గమ్యం లేని నడక. అయినా అతనికి విసుగ్గా లేదు. నడక కోసం నడక. నగరం సందోహంగా సంబరంలా ఉంది. సెంటర్లూ జంక్షన్లూ దాటడానికి తికమక పెడుతున్నాయి బాట సారులని. నేల యీనినట్లు జనం. వీళ్ళందరూ యీ నగరంలోనే నివసిస్తున్నారా? ఎన్నెన్నో షాపులు. ఇక్కడి ప్రజలింత ధన వంతులా!?

ఈ మనుషులలో ఒకడిగా—ఈ నగరంలో ఉద్యోగిగా బ్రత కాలని వెయ్యి కలలతో వచ్చాడు తానూను. కాని-యీ నగరం నిర్దయగా పొమ్మంటోంది. తన కిక్కడే ఆశ్రయం దొరకలేదు!

స్కూటర్ ఆగిన చప్పుడు.

బ్రేకుల చప్పుడు. ప్రక్కకి-అడుగు.

అంతలోనే భుజం మీద చెయ్యి. గొంతు నిండా పలకరింపు. "హలో! హరీ!" చూశాడు. ఒక్కసారి సంతోషం ముప్పిరిగొంది. "ఆనంద్! నువ్వా!?"

"నేనే. నువ్వేమిటిలా వచ్చావ్? నీ ఉద్యోగమూ యిక్కడేనా? ఏ ఆఫీసులో?"

మందమారుతమూ, మలయానిలమూ వంటి స్నేహపు చిలకరింపుకి అతని మనసు పూర్తిగా చల్లబడింది. కానీ- ఆ కొన

ప్రశ్న- అంత అదృష్టమా తనకి? ఉద్యోగం అందరాని అందలమై పోయింది తనకి.

"ఇంకా ప్రయత్నాంలోనే ఉన్నాను. ఇక్కడ యింటర్వ్యూకి వచ్చాను."

"విష్ యు గుడ్ లక్!"

"ఇంకేం గుడ్ లక్? దాదాపు తేలిపోయినట్లే...."

"ఫలితం- చెప్పేశారా?"

"నోటితో చెప్పలేదనుకో- ఇంటర్వ్యూ కమిటీ ముఖాలు చెప్పేశాయి."

"ఆ ముఖాల నుంచి విషయం గ్రహించడమంటే- యినక మంచి తైలం తీసినట్లే. కర్ర ముఖాల వాళ్ళనే కమిటీలో వేస్తారు. అదీకాక వాళ్ళు అనుభవజ్ఞులు. ఉద్యోగం యివ్వదలుచుకున్నా, మానినా ఒక్కలాగే ప్రదర్శిస్తారు తమ హావభావాలు."

ఆనంద్ మాటలు నిజమే అనిపించాయి.

మళ్ళీ ఆశ. తనకి ఉద్యోగం వస్తుందేమో! వాళ్ళు ఎక్కువ సేపు తీసుకుని ఎక్కువ ప్రశ్నలు వేయలేదని తను నిరుత్సాహపడి పోయాడు కానీ, అడిగినవి చాలవూ- తన సత్తా తెలుసుకుందుకు? అన్నం ఉడికిందో లేదో చూడడానికి ఓ మెతుకు పట్టి చూస్తే చాలదూ?

"ఏమయినా మంచి ప్రశ్నలు వేశారా?"

"ఊc. రైలు కంటె ముందు పరుగెత్తేదేదని అడిగారు."

"ఏం చెప్పావ్? పట్టాలనా, పొగ అనా?"

"ప్రయాణరు దృష్టి అన్నాను."

"చాలా చక్కని-తెలివయిన జవాబు. అడిగిన వాడు కదిలి పోలేదూ?"

"చలించినట్లు లేదు."

"పద. అలా హోటల్లోకి వెళ్ళి కాఫీ తాగుదాం. నువ్వు చాలా అలసిపోయినట్లున్నావు. ఇంటర్వ్యూ అంటే తేలిగ్గా అనిపి స్తుంది కానీ, చాలా నెర్వస్ టెన్షనుతో కూడుకున్న వ్యవహారం."

ఆప్యాయమయిన ఆ మాటలకు హరి పొంగిపోయాడు. ఆనంద్ కాలేజీలో తన క్లాస్ మేట్- స్నేహితుడు. ఆ పైన-యీ

పరిస్థితిలో-ఎవరూ తెలియని వూరిలో అతను కనిపించడం, అభిమానంగా పలకరించడం....రాదని నిశ్చయించేసుకున్న ఉద్యోగం వస్తుందేమో అన్న ఆశను రేకెత్తించడం। హరికి మళ్ళీ ప్రపంచం— ఆశావిలయమూ, మధురమూ ఐపోయింది.

స్వీటూ హాటూ ఆర్డరు చేశాడు ఆనంద్.

"ఇంకా ఏం అడిగారు?"

"అబార్షనంటే ఏమిటని?"

"పిల్లీ! మగవాడి అనుభవానికి అందనిదని చెప్పలేకపోయావు?"

"అప్స్ లేబర్ లాస్టని చెప్పాను."

"సుపర్బ్! మార్వలెస్! గుడుడు డంగైపోలేదూ? ఇంకా నీకు సందేహం దేనికి? తప్పకుండా నీకు సెలక్షన్ వస్తుంది. వచ్చి తీరుతుంది."

"ఇది-పన్నెండోసారి. ఎప్పుడూ నేను బాగా తయారయ్యే హాజరయ్యాను. కాని-ఫలితం వ్యతిరేకంగానే వచ్చింది. ఈసారయినా ఉద్యోగం వస్తే ఫరవాలేదు." భారంగా అన్నాడు హరి.

"వర్రీకాకు. నీలాటి తెలివయిన వాడికి ఉద్యోగం రాకపోతే అంతకంటె అప్రతిష్ట యీ దేశానికింకేమీ లేదు."

"ఆనంద్! నువ్వేం చేస్తున్నావ్?"

"స్టేట్ బ్యాంక్‌లో ప్రొబేషనాఫీసర్ని."

క్షణమాత్రం హరి యీర్ష్యను జయించకుండా ఉండలేకపోయాడు. ఒక్కసారి అతని కన్నులలో చీకటి ముసిరింది. అంతలోనే ఆ భావాన్ని చెరిపేసుకుని మామూలుగా స్వచ్ఛంగా అయ్యేందుకు ప్రయత్నించాడు. స్నేహాన్ని-యీర్ష్యా, అసూయా కలుషితం చెయ్యడం ఎంత నీచం! ఇంకా తనకి జ్ఞాపకం ఉంది-బాగా. ఆనంద్ చదువులో వెనకబడి ఉండేవాడు. ఫైనల్ ఎగ్జామ్స్‌లో ఓట్ పేపరులోనూ, మెయిన్ పేపరులోనూ పాసు మార్కులకంటె ఎక్కువే సాయం చేశాడు తను అతనికి. అందుకే పాసయ్యాడతను. తన సాయంతో పాసయిన అతను-ఆఫీసర్! తను కనీసం గుమాస్తాయేనా కాలేక పోయాడు. తను-అతని అదృష్టానికి అసూయ పడడం కాదు,

తన దురదృష్టానికి చింతిస్తున్నాడంతే! ఐరనీ ఆఫ్ ఫేట్‌ని అర్థం చేసుకుంటూ ఆశ్చర్యపడుతున్నాడంతే!

"ఇప్పుడెక్కడుంటున్నావ్?"

"మా వూళ్లోనే."

"అంటే- విలేజ్‌లో?"

"ఊఁ." కొంచెం ఆగి-"నాన్నగారు పోయారు. ఆ పల్లెటూళ్లో అయితే కొంత చవకలో బతకవచ్చునని-అక్కడికి మారిపోయాం."

"మీ ఫాదర్ పోయారా? సారీ.... వెరీ సారీ!"

"ఆనంద్! నాకు రైలుకి వేళౌతూంది-శలవ్." రోడ్డు మీదకు వచ్చాక అన్నాడు హరి.

"కనిపించక కనిపించక కనిపించావ్. నిన్నింత త్వరగా వెళ్ళనిస్తాననేనా? ప్రయాణం సంగతి మరచిపో- రూముకి పోదాం."

"రూమ్!?"

"ఆఁ. ఇంకా నేను ఒక యింటివాడిని కాలేదులే. స్వేచ్ఛా జీవినే. రూము బాగుంటుంది. అసలు నువ్వు ఆ పల్లెటూళ్ళో ఉండి ఏం చేస్తావ్? ఇలాటి సిటీల్లో ఉండడం మనిషికి చాలా విధాల నయం. ఉద్యోగావకాశాలు కూడా యిక్కడ ఎక్కువ. తరువాత జ్ఞానం వికసిస్తుంది. కమాన్- ఎక్కు" అంటూ స్కూటర్ స్టార్ట్ చేశాడు- హరి వెనుక సీటు మీద కూర్చున్నాక. హరికి ఆనందంగానే ఉందీ మలుపు. అతనికేమీ సాధించకుండా వట్టి చేతులతో యింటి కెళ్ళడం ఏ మాత్రమూ యిష్టం లేదు.

స్కూటర్ వేగానన్నుభవిస్తూ, సిటినీ చూస్తూ, ఆలోచనలు చేస్తూ కాలగమనాన్ని మరచిపోయాడు హరి. స్కూటర్ ఓ యింటి ముందాగేక కాని అతను ప్రపంచంలోకి రాలేదు. ఆనంద్ వెనుక నడిచాడా యింట్లోకి. మధ్యరకం మేడ అది. మేడమీద 'వెంకటేశ్వర్ భవన్' అని చెక్కబడి ఉంది. క్రింద వాటాకి— 'హాపీ హెవెన్' అన్న బోర్డు తగిలించబడివుంది.

ఎదురుగా వరండా. వరండాలోకి రెండు ద్వారాలు.

"మనవాళ్ళింకా వచ్చినట్లు లేదెవరూ. ఈ లోగా ముఖం

కడుక్కొని తయారుగా వుందాం. మన గదికి బాత్‌రూం అటాచ్‌డ్."
తలుపు తీసి లోపలికి ఆహ్వానించాడు ఆనంద్—హరిని.

ఆ గది అచ్చంగా బ్రహ్మచారి గదిలాగే వుంది. కాకపోతే ఖరీదైన ఫర్నిచరుందంతే. జాగ్రత్తగా సర్దుతూండడాన విశాలంగానే ఉంది. అదీకాక ఆ గోడలకున్న పెద్ద పెద్ద అల్మాయిరాలు చాలా మంది మనుషుల వమాంతం మింగేయగలిగే రాక్షస నోళ్ళలా ఉన్నాయి. చాలా సామాను అల్మాయిరాలలోనే వుంది.

రోజ్‌వుడ్ డబల్ కాటూ, డ్రెస్సింగ్ టేబులూ... కళకళ లాడుతున్న వార్‌డ్రోబ్....తళతళలాడుతున్న టీపాయ్....మిలమిల మెరుస్తున్న సోఫా...హంగులన్నీ ఉన్నాయి. స్వతహాగానే ఐశ్వర్య వంతుల బిడ్డ-ఆ పైన ఉద్యోగి, ఆఫీసరూ. ఆ వచ్చిన జీతం వచ్చినట్లు ఖర్చు చేసేసుకోవచ్చు. కనుక—దర్జాగా జీవిస్తున్నాడు. అతని హోదాకి తగినట్లే ఉందా గది. డిస్టెంపరు చేయబడ్డ గోడలూ.... విశాలమయిన కిటికీలూ....నాలుగు గోడలకి ట్యూబ్‌లైట్లూ... రెండు సీలింగ్ ఫ్యానులూ....గది—దర్పంగా ఉంది.

స్నానం చేసి—బట్టలు మార్చుకుని వచ్చేసరికి—టీపాయ్ మీద ఫ్లాస్కూ- కప్పులూ రడీగా ఉంచాడు నౌకరు.

ఆనంద్ కూడా రిఫ్రెష్ ఐ వచ్చాడు.

టీ తీసుకోబోతూండగా—ఒక్కసారక్కడ చైతన్యం వెల్లి విరిసింది.

ఈలలు...కేకలు—హాలులో పలకరింపులు.

"మనవాళ్ళొచ్చారు- అంతే! భయపడకు." నవ్వాడు ఆనంద్- "ఇక ఇది క్లబ్బు ఐపోతుంది రాత్రివరకూ. మెస్‌కి వెళ్ళి టీ తాగి వద్దామా?"

"ఇప్పుడేగా తీసుకున్నాం!"

"పోనీకో. కాని—నిన్ను పరిచయం చెయ్యడానికి మెస్ ఐతేనే సుఖం. అందరూ అక్కడ దొరుకుతారు."

"సరే. కాని నేను మళ్ళీ టీ తీసుకోలేను. బలవంతం పెట్టకు."

"ఓ.కే. ఇక్కడ బలవంతం అనే మాటే లేదు. ఎవరికి

వారే ఫ్రీ." ఇద్దరూ మెస్ చేరుకున్నారు. ముందు యింటి తాలూకు ఔట్ హౌసది. వంటకీ స్టోరుకీ ఓ పెద్ద గది....దానికి ఆనుకుని విశాలమయిన వరండా. వరండాలో పెద్ద టేబులూ, దాని చుట్టూ కుర్చీలూ. ఆ కుర్చీలలో ఐదారు విండి—రెండు ఖాళీగా ఉన్నాయి. ఆనంద్ హరిని పరిచయం చేశాడు.

"హరి....మై ఫ్రెండ్. వెరీ ఇంటలిజెంట్. ఇతని దయ లేకపోతే నేను బి.ఎ.లో పర్మనెంటుగా ఉండిపోయే వాడిని."

"అయామ్ రఘు. వర్కింగిన్ ఎల్.ఐ.సి."

"అయామప్పారావ్ ఫ్రమ్ ఆడిట్ డిపార్ట్‌మెంట్."

"శంకర్....కలెక్టొరేట్..."

సరిగ్గా అప్పుడే ఓ నలభయ్యేయేళ్ళాయన అక్కడికి వచ్చి నవ్వుతూ—"నా పేరు డి.టి. నేను సత్యనారాయణని" అన్నాడు ముళ్ళపూడి పాత్రలా.

అందరూ నవ్వారు.

"ఇంకా యిలాగే కూర్చుండిపోయారేం - టైమ్ వేస్ట్ చేసేస్తూ....తొందరగా పదండి పురాణ కాలక్షేపానికి. ఈ లోగా నేను చాపలూ, దెప్టుమెంట్లూ సిద్ధంచేసి ఉంచుతాను."

టిఫిను పూర్తయ్యాయి. అందరూ ముందువేపుకి కదిలారు. ఆనంద్—వంటవాడికి రాత్రి చెయ్యవలసిన మెనూ చెప్పాడు.

ఆనంద్ గదికి ప్రక్కనున్న పెద్ద గదిలో పేకాట మొదలయింది.

"నువ్వు కూర్చో హరీ! మరేమీ ఫరవాలేదు...." అంటూ దబ్బుకి హామీ యిచ్చాడు ఆనంద్. కాని—"నాకు ఆట రాదు" అని తప్పించుకుని—"ఓ సారి అలా తిరిగి వస్తాను" అంటూ బయటకు వెళ్ళాడు. హరికి పేకాట రాకపోదు. కాని— వాళ్ళాడేది పెద్ద స్టేకు. చెయ్యి బాగులేక పున్నది కాస్తా పోయిం దంటే రేపు ఊరు వెళ్ళడానికి అప్పుచెయ్యవలసి వస్తుంది. అలా ఏం బాగుంటుంది?

నాలుగు రోడ్లు తిరిగి వచ్చేసరికి ఎనిమిదిన్నర అయింది.

"అనుకోకుండా యివాళ సెషన్స్ త్వరగా ముగించేశాం.

పద-భోజనంచేసి అలా తిరిగివద్దాం కబుర్లు చెప్పుకుంటూ" అన్నాడు ఆనంద్ హరికోసమే ఎదురు చూస్తున్నట్లు. ఇద్దరూ మెస్ చేరారు. భోజనం చాలా బాగుంది.

"సిగరెట్?"

"నో-థాంక్స్!"

"వెన్నెల బాగుంది. బీచ్ కి వెళ్దామా?"

"ఊఁ."

స్కూటరుమీద యిరవై నిముషాలలో బీచ్ చేరుకున్నారు. రోడ్డు పక్కన స్కూటరు పార్క్ చేసి—యిసుకలోకి దిగి కూర్చున్నారు.

సముద్రం అందంగా వుంది. అర్థంకాని పాటేదో పాడుతూంది వెర్రిగా.

"చెప్పు హరి! ఏమయినా కబుర్లు చెప్పు...."

"నా దగ్గరేముంటాయి చెప్పేందుకు?" నవ్వాడు హరి భారంగా.

"ఫాదర్ పోయారన్నావు కదూ! మరి....యిల్లు ఎలా గడుస్తూంది?"

"కష్టంగానే వుంది. పల్లెటూరు కనుక భుక్తికి లోటులేదు. కాని—నాకు ఉద్యోగం వస్తేకాని హాయిగా ఊపిరి పీల్చుకోడానికి వుండదు."

"నిజమే! నీకు ఉద్యోగం రావాలి. అందుకు—నువ్విక్కడ కొన్నాళ్ళుంటే మంచిది. పట్నాల్లో ఉద్యోగావకాశాలెక్కువ హరీ! నేనూ నీ కోసం సిన్సియర్‌గా ప్రయత్నిస్తాను. ఇక్కడుండిపో."

"ఆ....నం....ద్....నీ మేలు...ఎలా..."

"మనం స్నేహితులం. మనమధ్య ఆటువంటి మాటలు దేనికి?"

"నేను-భారం అవుతానేమో? ఒక మనిషిని మేపడం...."

"ప్లీజ్! ఆపు. నువ్వూ మాతో మెస్‌లో భోజనం చేస్తావు. మా గదులలో ఉంటావు. మిగిలిన వాళ్ళు కూడా మంచివాళ్ళే. ఏమీ అనుకోరు. నీకు త్వరలోనే ఉద్యోగం దొరుకుతుంది. నలుగురమూ

ప్రయత్నిస్తాం." ఆ చివరి మాటలతో హరి సందేహాలన్నీ పటాపంచ లయిపోయాయి. ఎటువంటి పరిస్థితులలో అయినా వారితో ఉండాలనే నిశ్చయించుకున్నాడు.

"థాంక్యూ ఆనంద్—థాంక్యూ...." అతని చేతులు పట్టు కున్నాడు.

"నువ్వు మాతో ఉంటావన్న శుభవార్త రేపు కాఫీల దగ్గర అనౌన్స్ చేస్తాను."

ఇద్దరూ గదికి వచ్చేశారు. ఆనంద్ హరిని తనతోపాటు డబల్ కాట్ మీద పడుకోమన్నాడు. కనీసం సోఫాకమ్ బెడ్ మీద అయినా. కాని-హరి తనకి మంచం అలవాటులేదంటూ చాప పరుచుకున్నాడు. ఆనందంతో అతనికి నిద్రపట్టడం లేదు. ఆనంద్ ఎంత మంచివాడు! నిజమైన స్నేహమంటే ఇదే. తనకోసం... తన ఉద్యోగం కోసం అతను చేస్తున్నదీ చేయబోతున్నదీ తక్కువేమీ కాదు. మిగిలిన మిత్రులు కూడా చాలా మంచివాళ్ళలా ఉన్నారు. తనెంత ఆదరంగా చూశారు—టీ దగ్గరా, భోజనాల దగ్గరా. వీళ్ళందరూ ఉద్యోగాలు చేస్తున్నవారు కనుక తప్పకుండా వాళ్ళకి చక్కని పరిచయా లుంటాయి. వాళ్ళ సాయంతో తనకీ ఉద్యోగం దొరుకుతుంది. దొరికి తీరుతుంది. ఆనంద్ చెప్పినట్లు పట్నాలలో అయితేనే ఉద్యోగావకాశా లెక్కువ. అయినా ఆ పల్లెటూళ్ళో వుండి చేసేదేముంది తను? నిరా రిస్తూనూ పరిస్థితులను తిట్టుకుంటూనూ నిముష నిముషమూ భారంగా గడపడం తప్ప?

కొత్త చోటూ..ఉక్కిరి బిక్కిరిచేసే ఆలోచనలూ...భవిష్యత్తు మీద ఆశా....అంతలోనే ఏం కాబోతుందో? అన్న ఆందోళనా...హరి ప్రసాద్‌కి నిద్ర పట్టనివ్వలేదు.

• • •

తెల్లవారింది. అలవాటుగా-సూర్యోదయ సమయానికే మెలకువ వచ్చేసింది హరిప్రసాద్‌కి. బాత్‌రూముకి వెళ్ళి కాలకృత్యాలు తీర్చు కుని వచ్చాడు. ఇంకా ఆనంద్ నిద్రపోతూనూ, గుర్రుపెడుతూనూ వున్నాడు. పేపరువాడు బెల్ మోగించుకుంటూ వచ్చి న్యూస్ పేపరు వరండాలోకి విసిరి వెళ్ళాడు. హరి అది తీసుకుని చదువుతూ కూర్చు

న్నాడు. ఎనిమిదౌతున్నా ఎవరూ లేవలేదు. హరి ఆశ్చర్యపోయాడు. వీళ్ళు ఇంత ప్రొద్దెక్కే వరకూ ఎలా నిద్రపోగలుగుతున్నారో! అసలు నిద్ర ఎలా పడుతుందో! తనకి రాత్రి త్వరగా నిద్ర పట్టనూ పట్టదు, ఉదయం పడకమీద వుండబుద్ధీ కాదు.

నౌకరు ఫ్లాస్కుతో కాఫీతెచ్చి ఆనంద్ తలదగ్గర టీపాయ్ మీద వుంచి వెళ్ళాడు కప్పుతో సహా.

హరికి ఆకలిగా వుంది. తన ఊళ్ళోఅయితే ఈపాటికి చద్దన్నం తింటూండేవాడు. ఇక్కడ అది కుదరదు. అందరితోపాటు కాఫీ టిఫిన్‌ల కలవాటుపడవలసిందే. అయినా ఫరవాలేదు.

ఉద్యోగం దొరికేవరకూ తను ఏ సుఖాలనయినా వదులుకుంటాడు. ఇందరు మంచివారి మధ్య తనకి తప్పకుండా త్వరలోనే ఉద్యోగం దొరికితీరుతుంది.

"ఎంతసేపయింది! గుడ్ మార్నింగ్!"

"గుడ్ మార్నింగ్!"

"ఇంకా నువ్వు కాఫీ తాగినట్లులేదు! కమాన్—నాకోసం ఎందుకు కూర్చున్నావ్!.... నేనెప్పుడూ మెల్లగానే లేస్తాను."

బెడ్ కాఫీ తీసుకొని-బాత్ రూంకి వెళ్ళి అరగంటకు వచ్చాడు. డ్రెస్ కూడా వేసుకుని, "పద-బ్రేక్‌ఫాస్ట్ తీసుకుందాం."

మెస్‌లో అందరూ చేరారదే వేళకి. ఆనంద్ కాక మరి ముగ్గురు.

"హరి—ఉద్యోగం వచ్చే వరకూ మనకి గెస్టుగా వుంటాడు. అందుకు మీకెవరికీ అభ్యంతరం వుండదనుకుంటాను!"

"అభ్యంతరమా! ప్లెషర్....మన డ్యూటీ. మన స్నేహితులకి మనం సహాయం చేయకపోతే అంతకంటె ఘోరమూ నేరమూ మరేమీ వుండదు."

"థాంక్యూ! హరి-హరిప్రసాద్ గ్రాడ్యుయేట్. బి. ఏ. ఎకనమిక్స్. సెకండ్ క్లాసుకి దగ్గరగా వచ్చాయి మార్కులు. ఇవి దృష్టిలో పెట్టుకుని-మీ డిపార్టుమెంట్‌లో ఎంవరకీ వేకెన్సీలేమైనా వస్తే..."

"తప్పకుండా—తప్పకుండా..."

హరి ముగ్ధుడైపోయాడు. ఎంత ఆదరణ! ఎంత మంచి ఆతిధ్యం! బ్రేక్‌ఫాస్టు తీసుకోడం అయిపోయింది.

"హరీ! నువ్వు నాతో బ్యాంక్‌కిరా. ఒక్కడివీ ఇంటిదగ్గ రుండి ఏం చేస్తావ్?"

"అలాగే."

ఆనంద్‌తోపాటు హరి అతని బ్యాంక్‌కి వెళ్ళారు. కొంత సేపయ్యాక ఆనంద్ బ్యాంక్ పనిచేసే విధానం గురించి చెప్పి-కౌంటర్లూ, స్ట్రాంగ్ రూమూ అవీ చూపాడు దూరంనుంచే.

"థాంక్యూ ఆనంద్! చక్కని జ్ఞానం కలిగించావు బ్యాంకు గురించి. ఇది నాకు చాలా ఉపకరిస్తుంది-పరీక్షలకీ, ఇంటర్వ్యూలకీ."

మధ్యాహ్నం అయ్యేసరికి ఇక తోచడం మానేసింది. ఆనందేమో పనిలో లీనమైపోయాడు. అంతకీ-ఇన్‌లాండ్ లెటర్ తీసుకుని ఇంటికి వుత్తరం వ్రాయసాగాడు హరి.

"అమ్మా!

నేనిక్కడికి క్షేమంగానే చేరాను. ఇంటర్వ్యూ బాగానే చేశాను. కాని-ఫలితం దైవాధీనమేకదా! ఇక్కడుంటే వుద్యోగం వచ్చే అవకాశాలెక్కువ. తెలిసిన వాళ్ళు వున్నారు. అందుచేత ఇక్కడ కొన్నాళ్ళుండి ఉద్యోగ ప్రయత్నాలు చేస్తాను. ఇంటి పరి స్థితి నాకు తెలుసు. నే నిక్కడ కాలక్షేపం చెయ్యగలను. నువ్వు డబ్బు పంపవలసిన అవసరం వుండదు.

ఉద్యోగం దొరకగానే నిన్నూ చెల్లినీ నా దగ్గరకు తెచ్చేసు కుంటాను. నా గురించి నువ్వేమీ బెంగపడకు. నే నిక్కడ సుఖంగానే ఉండగలను. చదువుకుని కూడా నిన్నూ చెల్లినీ పోషించలేక పోతు న్నందుకు నాకు సిగ్గుగానే ఉంది. అక్కడ-నేను చేసేదీ, చేయగలిగేదీ ఏముంది? ఇక్కడ....పట్నంలో అయితే....ఉద్యోగప్రయత్నాలకి అవకాశాలు ఎక్కువ ఉంటాయి. స్వర్ణకి నా ఆశీర్వాదాలు చెప్పు. నమస్కారములతో....నీ హరి."

"ఉత్తరం పోస్టు చేసి వస్తాను."

"ఇక్కడ టపాలో వేసెయ్యొచ్చు...ఓ! నీకు తోచడంలేదు కదూ? సరే—తిరిగిరా."

హరిప్రసాద్ బ్యాంకునుంచి బయటకు వచ్చాడు. ఎండ ఎక్కువగానేఉంది. కానీ అతనికి మాత్రం అలా అనిపించలేదు. రోడ్డుమీద నడవసాగాడు. హఠాత్తుగా అతనికి నిన్నటి యింటర్వ్యూ జ్ఞాపకం వచ్చింది. దానిఫలితం అప్పుడే తెలుస్తుందా? తెలియపరచ రేమో యింత త్వరగా. రెండుమూడు రోజులుపోయాక కనుక్కుంటే సరి. ఎర్రడబ్బా కనిపించింది. ఉత్తరం పడేశాడు దానిలో.

ఇప్పుడేం చేయాలి?

మళ్ళీ బ్యాంక్‌కి వెళ్ళడం అంటే విసుగ్గా ఉంది. రోడ్డు సర్వే చేద్దామంటే ఎండగా ఉంది. రూముకి వెళ్ళినా-తన దగ్గర తాళంలేదు. వరండాలోకూర్చుని నిరీక్షించాలంతే! పేపరు కొనుక్కుని పోతే సరి.

సరిగ్గా అంతే చేశాడు. కాని అతని ఊహకి విరుద్ధంగా హాపీ హెవెన్‌లో ఓ గదిమాత్రం తీసి ఉంది. అందులో అడిటప్పారావు వుంటాడు.

అడుగుల చప్పుడు విని కాటోలు బయటకు వచ్చాడు. "మీరా- రండి!"

"ఫరవాలేదు. మీరెక్కడికో వెడుతున్నట్లున్నారు."

"పిక్చర్‌కి వెళ్దామనుకుంటున్నాను. మీరూ రాకూడదూ సరదాగా?"

చాలాదూరం ఆలోచించి- "వొద్దు" అన్నాడు హరి మొహమాటంగా.

"చిన్నపిక్చరే. ఆనంద్ వచ్చేవేళకి మనమూ వచ్చెయ్యవచ్చు. ప్లీజ్....రండి. కంపెనీ లేకపోతే బోరుకొడుతుంది."

ఆ స్నేహభావానికి లొంగి పోకుండా ఉండలేకపోయాడు. కూల్‌డ్రింక్, టిక్కెట్లు, ఆటోచార్జీలు- అన్నీ అప్పారావే భరించాడు- హరి యిస్తానన్నా యివ్వనివ్వకుండా.

దీపం దీపాన్ని వెలిగిస్తుంది. స్నేహమూ అంతే! స్నేహితుడు స్నేహితులను పెంచుకుంటూ పోతాడు. కాకపోతే నిన్న యీపాటికి అప్పారావెవరో తనెవరో? ఇప్పుడు- ఆప్తులూ ఆత్మీయులూ ఐపోయారు.

పిక్చర్ఐ-రూముకి వచ్చారు. ఇంకా ఆనంద్ రాలేదు.

చతుర్ముఖ పురాణం ప్రారంభమయింది. నలుగురే ఉన్నారు.

"మీరూ చెయ్యికలపండి!" ఎల్. ఐ. సి. రఘు అన్నాడు.

"వొద్దండీ!"

"ఆట తెలుసునా-తెలియదా?"

"తెలుసు కాని..."

"స్టేక్ గురించి వర్రీకాకండి. మీ లాభనష్టాలు నావి. ఓ.కే.?"

తప్పని సరి ఐ కూర్చున్నాడు. మొదటి రెండాటలూ హరికే అయ్యాయి. కాని- ఎనిమిదిన్నరకి ఆట ఎత్తేసే సమయానికి పదిహేనురూపాయల నష్టంలో ఉన్నాడు. రఘు యిచ్చిన పాతికకి పదే తిరిగి యిస్తూంటే అతనికి చాలా సిగ్గువేసింది. తన వద్ద నున్న పదిహేనూ తీసి యిచ్చెయ్యబోయాడు.

"మాటంటే మాటే. అయినా యిటువంటి చిన్న విషయాలు పట్టించుకుంటే ఎలా?" అనేశాడు రఘు. ప్రసాద్‌కి తన వద్ద మిగిలిన పదిహేనూ యిచ్చెయ్యడంఅంటే ప్రాణాలు పోతున్నట్లేఅనిపించింది. ఈ కొద్దిపాటి మొత్తమయినా ఉండకపోతే హటాత్తుగా ఏదయినా అవసరం వస్తే?

ఆనంద్ వచ్చాడు తూలుతూ. "హరీ!"

"ఊఁ."

"చెప్పకుండా ఎక్కడికి వెళ్ళావ్? పోస్టాఫీసుకి వెళ్ళి వస్తా నన్నావుగా?"

"రూముకి వచ్చేశాను." అపరాధిలా చెప్పాడు.

"నీకోసం ఎంత కంగారు పడ్డాననీ! కనీసం ఫోను చేసి చెప్పవలసింది."

ఆ కంఠంలోని ఆప్యాయతకి కరిగిపోయాడు హరి. ఎంత స్నేహం! ఎన్ని జన్మల వరమిది! అందుకే అన్నారేమో సృష్టిలో తీయనిది స్నేహమేనోయని. తీయనిదేకాదు, చల్లనిదీ చక్కనిదీ ఆ స్నేహమే. తను చాలా అదృష్టవంతుడు.

"ఓ ఫ్రండ్‌తో బార్‌కి వెళ్ళాను. నువ్వుంటే ఎంత బాగుం డేది! అతనికి నిన్ను పరిచయం చేసేవాడిని." ఆగి-"అందుకే యిది యింటికి తెచ్చాను" అంటూ గ్లాసులు తెచ్చి బాటిలు సీలు విప్పి

పోసి-"ఇది మంచి క్వాలిటీ. మంచి నీళ్ళతో అయినా కొట్టెయ్యొచ్చు."
అంటూ గ్లాసులు నింపాడు.

"కమాన్-ఛీర్స్...."

"వద్దు ఆనంద్- వద్దు. నా కలవాటు లేదు."

"స్వర్గాన్నెవడూ వద్దనకూడదు. కమాన్ మై ఫ్రండ్." ఆనందే గ్లాసులు రెండూ తాటించి-హరిప్రసాద్ గొంతుకు దగ్గరగా తెచ్చాడు.

ఒకే ఒక్క గుక్క!

చేదుగా....వగరుగా.... తీయగా .... హాయిగా .... బాధగా.... వేడిగా....చల్లగా.

"నాకేదోలా ఉంది. ఇక చాలు."

పకపక నవ్వి-బాటిలు కాళీ చేసేశాడు ఆనంద్.

హరిప్రసాద్ చాలా తప్పు చేసినట్లు ఉండిపోయాడు. 'నాయనా! నువ్వేం చేశావ్?' అని అమ్మ ఎదురుగా వచ్చి అడుగుతున్న ట్లనిపించి అతనికి కన్నీళ్ళే వచ్చాయి. 'ఇంకెప్పుడూ తాగను. నీ మీద ఒట్టు...స్నేహపు నిషాలో తాగవలసి వచ్చింది. నన్ను క్షమించమ్మా!' అతను వెక్కి వెక్కి ఏడ్చాడు. అంతలోనే గుర్తు వచ్చింది-ఆ గదిలో ఆనంద్ కూడా ఉన్నాడని. అటు చూశాడు.

మంచానికడ్డంగా పడున్నాడు ఆనంద్-బట్టలయినా మార్చుకో కుండా.

నౌకరు క్యారేజీ తెచ్చి గదిలో ఉంచి వెళ్ళిపోయాడు.

ఇప్పుడు హరిప్రసాద్‌లో కొంచెమయినా నిషా లేదు. అంతా దిగిపోయింది.

"ఆనంద్!" అంటూ వచ్చాడు శంకర్.

ప్రసాద్ లేచి నిలుచున్నాడు. ఏం చెప్పాలో, ఏం చెయ్యాలో తోచలేదతనికి.

"మందు కొట్టేసి మంచ మెక్కేశాడన్న మాట! ఓహ్! మీరేం చేస్తున్నారు?"

"ఏ....మీ....లేదు."

"ఏమీ చెయ్యకపోతే యిక్కడెందుకూ! నా రూముకి రండి. చిత్రం చూపిస్తాను."

'ఏమిటో!' అనుకొంటూ వెళ్ళాడు హరి-శంకర్ వెంట. ఇద్దరూ గదిలో ప్రవేశించాక తలుపువేసి-పెట్టెలోంచి ఆల్బమ్‌లాటిది తీశాడు. "చూడండి."

హరిప్రసాద్ చూశాడు. కళ్ళు తిరిగిపోయాయి. షాక్ తగిలి నట్లయింది. ఇటువంటి వాటి గురించి అతనింతకు మునుపు విని ఉండకపోలేదు. కాని అతనవి నమ్మలేకపోయాడు.

"చాలా నాచురల్‌గా ఉన్నాయి. కదూ!"

నాచురల్! ఔను-ప్రకృతి స్త్రీని ఎలా పుట్టిస్తుందో-అలాగే పెరిగి వయసు వచ్చినా వొంటి మీద నూలు పోగు లేకుండా అందా లన్నీ వొంపుతూ అభిమాన రహితంగా సిగ్గు విడిచి నిర్లజ్జగా....

ఏం నాగరికత యిది! ఇలా బొమ్మ దిగేందుకెలా అంగీకరిం చారా స్త్రీలు? ఏ స్త్రీ కూడా ఆ బొమ్మలలో తనదంటూ దాచుకుందు కేమీ మిగుల్చుకోకుండా-చూసేవాడిలో నీచ ప్రవృత్తినీ, బలహీనతనీ రెచ్చగొడుతూ....

"ఈ అమ్మాయి చూడండి. ఎంత చక్కని బస్ట్! ఎంత చక్కని కర్వ్!"

కళ్ళు మూసేసుకున్నాడు హరిప్రసాద్. అతనిలో ఆ బొమ్మలు కుతూహలం కంటె జుగుప్సనే కలిగిస్తున్నాయి. అదీకాక అతనికి చాలా ఆకలిగా ఉంది. ఎప్పుడో పొద్దున్ననగా తిన్న భోజనం. ఇంట్లో అయితే చీకటి పడేసరికి అన్నం తినేసి ఏ పుస్తకమో చదువు కునేవాడు.

"నా దగ్గర మంచి లిటరేచరుంది. కావాలంటే చదవొచ్చు."

ఆ సాహిత్యమేమిటో చూడకుండానే అర్థమయిపోయిందతనికి. అతని ఊహ నిజమేనని ఆ గ్రంథ రాజాల అట్టలు నొక్కి-వక్కాణిస్తున్నాయి.

"ఆనంద్ లేస్తాడేమో!"

"కూర్చోండి మహానుభావా-వెళుదురుగాని. నాకు ఒంటరిగా

చూస్తే యివి చూసి నట్లుండదు. ఏదయినా కంపెనీ ఉంటేనే మజా. దీన్ని చూడండి-చూశారా ఎంత కైపు దాచిందో కళ్ళలో."

"ఊఁ." బలవంతంగా ఊఁ కొట్టాడు.

"గురువుగారు వేడెక్కి పోయినట్లున్నారు." వెకిలిగా నవ్వాడు శంకర్.

ఏడవలేక నవ్వాడు హరిప్రసాద్. అతని కడుపులో కామన్న కదం తొక్కేస్తున్నాడు. కనీసం మంచినీళ్ళన్నా పొయ్యకపోతే పరువు దక్కించేటట్లు లేదు.

"మళ్ళీ వస్తాము. ఏమీ అనుకోకండి."

ఆనంద్ గది తలుపులు లోపల గడియ పెట్టబడి ఉండేసరికి-విస్మేరపోయాడు. గదిలో దీపం వెలుగుతూంది. కిటికీలోంచి అంతా స్పష్టంగానే కనిపిస్తూంది. అతను భోజనం చేసేసినట్లు గిన్నెలన్నీ అస్తవ్యస్తంగా పడున్నాయ్ టేబులు మీద. మూలనున్న కూజా ఖాళీగా వొరిగిపడుంది.

తాగిన మైకంలో అన్నీ మరచిపోయుంటాడు. వొళ్ళు తెలియని తనంలో తినేసి-స్నేహితుడి సంగతి కూడా మరచి, స్పృహ తప్పినట్లు మంచం మీద పడున్నాడు. అయ్యో! తను లుంగీ కట్టుకోకుండా ప్యాంటుతో ఉన్నా బాగుండిపోయేది. ఆ జేబులో డబ్బులుండిపోయాయి. రోడ్డు మీదకు వెళ్ళి బన్ అయినా తినేవాడు. ఇప్పుడెలా?

మెస్ వేపు వెళ్ళాడు. ఆ హాలుకి తాళం కప్పవేసేశారు. రాత్రి పదవుతోంది. కుక్ యింకా ఎందుకుంటాడు?

ఆకలి....దాహం....నీరసం....విస్రాంతి!

శంకర్ గదివేపు నడిచాడు. ఆ గదిలోంచి గుర్రు వినిపిస్తోంది.

అంతకీ సిగ్గు విడిచి ఒకటి రెండు సార్లు గట్టిగానే పిలిచాడు. "శంకరంగారూ!"

ఊహూఁ—అటునుంచి రెస్పాన్స్ లేదు. కుంభకర్ణుడిలా నిద్ర పోతున్నాడు.

ఆకలి....కడుపులో మంటలు.

దాహం....నాలుక పిడచకట్టుకు పోతోంది.

మళ్ళీ ఆనంద్ రూముకి. "ఆనంద్-ఆనంద్!"

ప్పు—అతనసలీ లోకంలోనే ఉన్నట్టులేదు!

క్రూరమయిన ఆటలో అమాయకమయిన పావు ఐపోయాడు తను.

ఇప్పుడేం చెయ్యాలి? ఏం చెయ్యగలడు తను?

ఆతిథ్యం దొరకని అతిథి ఐపోవలసి వచ్చింది. ఈ 'హాపీ హెవెన్'లో సారోపుల్‌గా ట్రాజిక్‌గామిగిలిపోవలసి వచ్చింది. లాభం లేదు—నిలబడేందుకు కూడా నీరసంగా ఉంది. నిస్త్రాణగా-వరండా గచ్చు మీద వాలిపోయాడు. ముడుచుకుని పడుకున్నాడు. కడుపులో అగ్ని జ్వాలలు. వరండా గచ్చు—చల్లగా, అతి చల్లగా....హిమ జ్వాలలా. ఎంత ప్రయత్నించినా నిద్ర రావడం లేదు. ఎలా వస్తుంది?

పదకొండు....

దుఃఖం ఎక్కువౌతోంది. అమ్మ జ్ఞాపకం వొస్తోంది.

పన్నెండు....

ఏడుపొచ్చేస్తూంది. దేముడు కనిపిస్తున్నాడు.

'దేవుడూ! నా ఆకలి తీర్చు. కావాలంటే నా ప్రాణాలు తీసుకో. నన్ను ఆకలితో మాడ్చి చంపకు.'

"చిన్న పిక్చరయితే అయింది కానీ బ్రహ్మాండంగా లేదూ?"

"సుపర్బ్ పిక్చర్!"

'హాపీహెవెన్' గేటు చప్పుడయింది. రఘూ, అప్పారావూ వొస్తున్నారు.

"ఎవరది?"

"నేనే!" నీరసంగా అన్నాడు ప్రసాద్-లేచి కూర్చుంటూ.

"ఇక్కడ పడుకున్నారేం?"

సిగ్గుపడి పోయాడు. తల వంచుకున్నాడు.

పరిస్థితి అర్థం చేసుకున్నట్టు—"పదండి—మా రూములో పడుకుందురుగాని" అన్నాడు రఘు.

"ఇవాళ ఆనంద్ మందు కొట్టాడా? కంపెనీ తెచ్చుకున్నాడా?" జవాబు చెప్పలేదు హరిప్రసాద్. మౌనంగా వాళ్ళ వెంట నడిచాడు. వాళ్ళ చేతుల్లో అరటి పళ్ళున్నాయి. వాటిని చూసేసరికి లాక్కు తినేద్దామనిపించింది.

"మీ రూములో మంచి నీళ్ళున్నాయా?" అడిగాడు.

"ఉన్నాయి." లైటు వేశాడు రఘు. "అరె! అలా ఉన్నారేం? అన్నట్లు మీరు భోజనం చేశారా?"

"లే....దు...." సిగ్గు పూర్తిగా వదిలేయవలసి వచ్చినందుకు బాధపడ్డాడు హరి.

"ముందీ అరటిపళ్ళు తినండి."

కుక్కి-కలియబడ్డట్లు తినేశాడు. రఘు అందించిన నీళ్ళు తాగాడు. అప్పటికి ఆత్మారాముడు శాంతించి, అతనికి వివేకం మేల్కొంది. సిగ్గు వేసింది. దరిద్రుడికి ఆకలెక్కువట. తను చాలా దరిద్రుడు. లేకపోతే అంత విలువలేక పోడమేమిటి ఆకలికి? చిన్న పిల్లవాడేమీ కాదుగా?

"ఏం జరిగిందో చెప్పండి ప్రసాద్?" అడిగాడు రఘు.

"దయచేసి ఆ విషయం వదిలెయ్యండి. నేను చెప్పలేను."

"దెన్ ఆల్‌రైట్....మరచిపోండి. గుడ్‌నైట్!"

"థాంక్యూ! గుడ్‌నైట్!"

హరికి నిద్ర పట్టడంలేదు. ఆలోచనలు ముసురుకుంటున్నాయి ఆకలి తీరగానే. ఎందుకిలా జరిగింది-ఆదిలోనే హంసపాదన్నట్లు? నిశ్చయంగా తెలుసు తనకి_ఆనంద్ కావాలని చేసిన అవమానం కాదు. కాని....తను అవమానించబడ్డాడు. ఏదేమయినా ఒకటి నిజం! ఇక్కడ అందరూ స్నేహమూర్తులు. వీరి నీడలో తనకి తప్పకుండా ఉద్యోగం దొరుకుతుందని ఆశగా ఉంది.

రెండు గంటల ప్రాంతంలో నిద్ర పట్టింది హరికి.

* * *

ఎనిమిదిన్నరకి ఆనంద్ వచ్చాడు. అప్పుడే లేచినట్లున్నాడు. "ప్రసాద్! రా...." ప్రసాద్ అప్పటికి లేచి ముఖం కడుక్కుని కాఫీ తాగి ఉన్నాడు. సందేహిస్తున్నట్లు మెల్లగా ఆనంద్ వెనుక నడవసాగాడు.

"రాత్రి జరిగినదానికి సిగ్గు పడుతున్నాను. క్షమించవూ?"

ప్రసాద్ చాలా చలించిపోయాడు. తను ఆనంద్‌ని క్షమించడమా?

"నీకు చాలా కోపం వచ్చి వుంటుంది. నిజమే! నేను మూర్ఖంగా ప్రవర్తించి ఉంటాను. హరీ! నన్ను క్షమించవూ!" బ్రతిమాలుతున్నట్లే అడిగాడు.

"ఏమీ జరగలేదు. మనలో మనకి క్షమాపణలేమిటి! అయినా— నువ్వేం చేశావని! ఏమీ చెయ్యలేదు." తేలిగ్గా అన్నాడు.

"నిజంగా! థాంక్యూ! నాకు తెలుసు హరీ! నువ్వు మంచి స్నేహితుడివి. నన్ను సులభంగా క్షమించెయ్యగలవు. నువ్వంటే నాకిష్టం. కమాన్-కాఫీ తీసుకుందాం. నీ కోసం మంచి వార్తదానాను."

"ఏమిటి!" ఆత్రంగా చూశాడు హరి తన ఇంటర్వ్యూ ఫలితం గురించేమో అని.

"కాఫీ తాగాకనే." నవ్వి—కాఫీ గ్లాసందించి—తాగుతూ— "త్వరలో బ్యాంక్ వాళ్ళు రిక్రూట్ చేసుకుంటారు. ఓ నెల, నెలన్నరలో ప్రకటన పడుతుంది. బ్యాంకుద్యోగం బాగుంటుందని చెప్పాలా!" అన్నాడు.

"కాని...ఎంప్లాయ్‌మెంట్ ఎక్స్చేంజి ద్వారా పేరు రావడం..."

"పిచ్చి హరీ! మా ఏజంట్....అదే బ్రాంచి మానేజరుకి నేరుగా ఒక క్యాండిడేటుని పంపే హక్కుంది. కనుక అతనికి చెప్పి అలా ఏర్పాటు చేస్తాను. నువ్వు బాగా చదువు. అఫ్‌కోర్స్.... ఆ విషయం నీకు చెప్పక్కరలేదనుకో. నిన్ను పరీక్షకు కూర్చోబెట్టే బాధ్యత నాది. లీవిట్ టు మి...."

"నీ మేలు..." ఆనందంతో మాటలు రాలేదు హరికి. ఆనంద్ ఎంత మంచివాడు!

"త్వరలో అవకాశం చూసి నిన్ను మా మానేజరుకి పరిచయం చేస్తాను." తాయిలం దొరుకుతుందని చిన్న పిల్లవాడు మురిసిపోయేటట్లే మురిసి పోయాడు హరిప్రసాద్.

ఆనంద్ మరో అరగంటలో బ్యాంక్‌కి వెళ్ళి పోయాడు.

ప్రసాద్ పేపరు చదువుకుంటున్నాడు. శంకరం వచ్చాడు.

"అమ్మయ్య! బ్రతికించారు. మీరుండరేమో అని హడలి వచ్చాను." తనతో అతనికంత కొంపలు మునిగే పనేమిటా అనుకున్నాడు.

"మా రూముకి దయచెయ్యండి గురూ గారూ!"

ఫోటోలు చూపడానికి కాబోలు! వచ్చాం. ఈయనకి నగ్న సుందరుల సౌందర్యారాధనకంటె పనేమీ ఉన్నట్లు లేదు. ఎలాగూ ఉద్యోగం చేస్తూనే ఉన్నాడు. హాయిగా పెళ్ళి చేసుకుని సుఖపడ కూడదూ? కొయ్య బొమ్మల మెచ్చు కనులకు కోమలుల సౌరెక్కునా అన్నట్లు శంకరం అర్ధ నగ్న చిత్రాలు చూసీ చూసీ అచ్చంగా అమ్మాయివస్తే అయోమయమైపోతాడేమో!

"ఓ రిపోర్టు అర్జంటుగా తయారు చెయ్యాలి. మధ్యాహ్నం ఆఫీసరుకివ్వాలి. మీరు సాయం చేస్తే...."

ప్రతికాననుకుని వెళ్ళాడతనితో. పని-కొత్తగా ఉన్నా కష్ట మేమీ లేదు. కూడికలూ, తీసివేతలూ-అంకెల గారడీ. రెండు గంటల కుస్తీతో పూర్తయింది.

"మీ అంకెలు చాలా అందంగా ఉంటాయి. పదండి— భోంచేద్దాం."

ఆ మాట ఎప్పుడంటాడా అని ఎదురు చూస్తున్నాడు హరి ప్రసాద్.

భోజనంచేశాక శంకరం ఆఫీసుకి వెళ్ళిపోయాడు. హరి— అనంద్ గదికి వచ్చి పుస్తకం పట్టుకున్నాడు. త్వరలోనే అతనికి నిద్ర వచ్చేసింది. సోఫాలోనే పడుకుండి పోయాడు. పుస్తకం జారి పడిపోయింది.

సాయంత్రం అతనికి మెలకువ వచ్చేసరికి—రఘు, మరో మిత్రుడూ వచ్చారు.

"హరిప్రసాదుగారూ!" పిలిచాడు రఘు.

"ఊఁ."

"మీరు యింట్లోనే ఉన్నారా?"

"ఊఁ."

"పోస్టుమాన్‌మంచి ఉత్తరాలందుకోడం మీకు నామోషీయా?"

"అబ్బే!" తెల్లబోయాడతని ధోరణికి.

"నా ఉత్తరం ఇక్కడ విసిరేసి వెళ్ళినట్లున్నాడు. జల్లు వచ్చిం దిగా! ఉత్తరం తడిసిపోయింది—చదవడానికి వీలులేకుండా. ఎవరు రాశారో కూడా తెలియకుండా పూర్తిగా అలుక్కుపోయింది...."

"సా...రీ..."

"నా పరిస్థితి అర్థం చేసుకుంటే....ఆలోచించండి మీరే. ఉత్తరం వచ్చింది. అడ్రస్‌లో నా పేరు తప్ప చదవడానికింకేమీ లేదు. ఎవరు వ్రాశారో, ఎందుకు వ్రాశారో—సస్పెన్స్! ఎప్పటికీ తెగని సస్పెన్స్! దీనికి జవాబు రాయలేను. తరువాత వాళ్ళు తిడుతూ రాస్తారు. హరీ! మీరెలాగూ ఇంట్లోనే వున్నారు—శ్రమ అనుకోక వుత్తరం తీసుకుంటే ఎంత బాగుండేది!"

"వెరీసారీ! నేను చాలా నిద్రపోయాను. పోస్టుమానూ, వర్షం రావడం కూడా నాకు తెలీదు."

"ఆల్‌రైట్! మీరు టీ తీసుకున్నారా? లేనట్లుంది-రండి."

"మీరు వెళ్ళండి-నేను మెల్లగా వస్తాను."

"సారీ...నాకు కొంచెం ప్రథమ కోపం. మనసులో ఏమీ దాచుకోలేను. మనసులోని మాట ముఖంమీద అనెయ్యడమే. నన్ను దుర్మార్గుడనుకోకండి"

మనసులోని మాట ముంఖమీద అనెయ్యడం గొప్పతనమా? పరుషంగా మాట్లాడేప్పుడు కొంచెము మంచీ చెడూ—ఆలోచించు కోవక్కరలేదూ? ఎదుటవాడిని నిందిచేటప్పుడు నిగ్రహం చూప నవసరం లేదూ? మనసులో మాటని ముఖంమీద అనేయగలడా ఈ రఘు-అవతలి వ్యక్తి ఎవరో ఆలోచించకుండా? తను నిరుద్యోగి. తాడు-బొంగరములేనివాడు. ఇక్కడ తను అతిథి, అనాథ. అందుకే కదూ—అంత చొరవగా అనగలిగాడు రఘు? అప్పారావునో ఆనంద్‌నో అయితే ఇలా అనగలిగేవాడేనా? అయినా మనసులో మాట ముఖంమీద నిర్మొహమాటంగా అనెయ్యడం ఘనమైన విష యమా? మాట-మృదువుగా వుండనక్కర్లేదా? సభ్యతా సంస్కారమూ మాటల్లో ప్రతిబింబించవూ? వీళ్ళందరి దయాదాక్షిణ్యాల మీద ఆధార పడడంవల్లనే కదూ-ఇలా మాట పడవలసివచ్చింది! ఎటువంటి హీన స్థితిలో చిక్కుకున్నాడు తను.

"త్వరగా రండి-మీరొచ్చేవరకూ మేమూ టీ తాగం." చేయి పట్టుకుని తీసుకువెళ్ళాడు రఘు. కాదనడానికి వీల్లేని పరిస్థితిలో కద లక తప్పలేదు హరికి.

మెస్‌లో వాళ్ళు ముగ్గురే వున్నారు. టీ తాగుతూ-

"మీరెలాగూ తీరికగానే వున్నారు. నాకు కొంచెం సాయం చేసి పెట్టకూడదూ ప్రసాద్‌గారూ?" అన్నాడు రఘు.

"ఏమిటి?"

"నేను కథలూ గట్రా వ్రాస్తుంటాను. పోటీకి నవల వ్రాశాను. ఆ చిత్తు ప్రతిని ఫెయిర్ చెయ్యాలి. మీ దస్తూరి బాగానే వుంటుందా?"

"మీరు కథలు రాస్తారా? రచయితలా!"

"ఎందుకంత ఆశ్చర్యం? నేను కథలు రాయకూడదా?" నవ్వాడు రఘు.

రచయిత అయివుండీ మాట నేర్పులేదేమా ఇతనిలో అని ప్రసాద్ ఆశ్చర్యపోతున్నాడు.

"అలాగే ఫెయిర్ చేస్తాను. కాని తప్పులు మీరు సవరించుకుంటారా మరి?"

"ఓ! ఎప్పుడు మొదలుపెడతారు? రెండువందల పేజీలు-పది రోజుల్లో రాసేయగలరు. మీకంతా తీరుబడేగా? థాంక్యూ-థాంక్యూ! ఫెయిరు చెయ్యలేక విరమించుకుందామనే నిశ్చయించేసుకున్నాను. మీరు దేముడిలా వచ్చారు. ఆ నవలకి బహుమతి వస్తే ఫిఫ్టీ-ఫిఫ్టీ. వస్తే ఏమిటి - వచ్చి తీరుతుంది."

"విష్ యూ బెస్టాఫ్ లక్!"

"విష్ యూ కాదు.... విష్ అజ్." సవరించాడు రఘు.

"మీ బోనస్ గురించి ఏదో పడింది పేపర్లో?" అంటూ వచ్చాడు సత్యనారాయణ.

"సుప్రీమ్ కోర్టు-జడ్జిమెంటుని తరువాత చెప్తానంది."

"వస్తే ఏడాదికి పదిహేనువందలో- చిల్లరో వుంటుంది కదూ?"

"అవును."

"మీ కేమయ్యా! బోలెడంత జీతాలు, ఆపైన బోనసులు...."

ఒక్కసారి ఛర్రుమన్నట్టు లేచాడు రఘు—"మీలాగే అందరికి మంటా-అసూయే ఎల్.ఐ.సి. అన్నా-బ్యాంకులన్నా. మా జీతాలు స్టేటు గవర్నమెంటు కంటె ఎక్కువే. కాని- అది సమంజసమే."

"ఎలా?"

"మనం నిజం మాట్లాడుకుందాం. మీకు జీతాలతో పనిలేదు. లంచాలే చాలు! ప్రజలలో మీకు పలుకుబడి ఉంటుంది. మీరంటే భయపడతారు జనాలు. డబ్బు చేతిలో పడితే తప్పు పని చెయ్యరు. బ్యాంకులూ, ఎల్.ఐ.సి. అలా కాదుగా? కాగితం మీద కనిపిస్తుంది అంత రాబడీ. కనుక ఇన్‌కమ్‌టాక్స్ సరిగ్గా చెల్లిస్తాం. మీది-పైకి కనిపించని-టాక్స్ చెల్లించని రాబడి...."

"స్టేట్ గవర్నమెంటులో అయినా అన్ని సీట్లూ కల్పవృక్షాలు కావు."

"కొన్ని సీట్లు కల్ప వృక్షాలని ఒప్పుకుంటున్నారు కదా! అంతెందుకు? మీ సర్వీసు పదిహేనేళ్ళు. మా దానిలో పదిహేనేళ్ళ సర్వీసున్నవాడికి నిశ్చయంగా మీకంటె ఎక్కువ జీతమే వస్తుంది. కాని-మీలా మేడలు వేసి అద్దెకివ్వగలిగే వాళ్ళు మా డిపార్టుమెంటులో లేనేలేరు. మీకు బంత్రోతుంటాడు...."

"సర్లే. పారాయణం ఉందా లేదా యింతకీ?"

"అదెందుకుండదు? పదండి." అని రూము తలుపు తీశాడు. మరో యిద్దరు మిత్రులు కూడా వచ్చారు. రఘు పేకదస్తాలు తీసి—చాపలు పరిచాడు.

"చక్కగా టైముకి వెళ్ళి టైముకి వచ్చేస్తారు. అలసిపోయాక పేకాటకి కుదరదేమో!" అని బయటకు విచారించాడు యింటి ఓనరయిన డి.టి. సత్యనారాయణ.

"టైముకి వెళ్తాం కనుక టైముకి వచ్చేస్తాం. మీకు దేనికీ టైము ప్రసక్తి లేదుగా? కిడుతుందంటే పనిచేస్తారు. లేదంటే సీటులోనే ఉండరు." బదులు తీర్చేసుకున్నాడు రఘు.

పేకాట మొదలయింది. హరిని కూర్చోమని రఘు అనలేదు. బ్రతికాననుకున్నాడు.

"రఘుగారూ! వ్రాతప్రతీ, కాగితాలూ యిస్తే నేను రాత మొదలు పెడతాను."

"ఆల్మయిరాలో వుంటుంది-చూడండి" అనేశాడు రఘు లేవకుండానే.

వెళ్ళి తీసి-"ఇదేనా? రాతి బొమ్మలు?" అడిగాడు రఘుని మరి.

"ఊఁ....దిగుపదానిలో....నాకు షో....తెల్ల కాగితాలుంటాయి. ఒక ప్రక్కనే రాసుకుంటూ పొండి. సత్యనారాయణగారూ! కలుపుమీది... జాక్‌పాట్ వెయ్యండి.

"మార్జిన్ ఎక్కువ వదలండి హరీ! నీటుగా కొట్టివేతలు లేకుండా వ్రాయండి."

"మీరు ద్వి అవధానం చేసేస్తున్నారు." నవ్వుతూ వ్రాత మొదలు పెట్టాడు హరి.

"ఏదీ....టైటిలు నేను రాస్తాను. పంక్చువేషన్ జాగ్రత్త.... డ్రాప్—మీ కర్థం కాకపోతే అడగండి-చెబుతాను."

చిత్తు ప్రతిని ఫెయిరు చెయ్యడంలో నిమగ్నుడై పోయాడు హరి. మిగిలినవాళ్ళు పేకాటలో కాలగమనమే మరచి పోయారు. ఎనిమిదిన్నర దాటుతోంచే ఆడిట్ అప్పారావు పరుగెత్తుకుంటూ వచ్చాడు.

"ఇంకా కూర్చున్నారా? అవతల గోపాల్రావ్ మీ కోసం ఎదురు చూస్తున్నాడు."

"ఏ గోపాల్రావ్?"

"ఓరి మీ యిల్లు పేకమేడ కానూ! ఒకప్పటి మన బ్యాచిలర్ ఫ్రెండ్... గోపీ....మొన్న పెళ్ళి చేసుకుని-ఇవ్వాళ డిన్నరు ఏర్పాటు చేశాడు. లేవండ్రా బాబూ, లేవండి. మనం లేటుగా వెడితే బాగుండదు."

ఎవరూ లేవలేదు.

"మెస్‌లో భోజనం ఉండదు. వండొద్దని చెప్పేశాను. మీరు వెంటనే లేచి రాకపోతే తిండి ఉండదు. రెండింటికీ చెడ్డ రేవళ్ళౌతారు."

హరిప్రసాద్ ఉత్రుళ్ళిపడ్డాడు. తన భోజనం సంగతేమిటి?

మొత్తానికి అప్పారావు సాధించాడు. అందరూ లేచారు. "రండి హరిప్రసాద్!"

"నేను....రావడం బాగుండదేమో...తెలియని వాడిని..." నీళ్ళు నమిలాడు.

"మీరు వేరూ—మేము వేరూ కాము. మీరు మా స్నేహితులు. మమ్మల్ని పిలిస్తే మిమ్మల్ని పిలిచినట్లే. త్వరగా పదండి."

వాళ్ళ వెనుక అతనూ కదిలాడు. వారి మాటలు సంగీతంలా వినిపించాయి- 'మీరు వేరూ, మేము వేరూ కాదు. మీరు మా స్నేహితులు.'

నడుస్తూ అడిగాడు రఘు—"ఎన్ని పేజీలు వ్రాశారు?"

"పది."

"గుడ్! అయితే త్వరలోనే....ఓ వారంలో పూర్తయిపోవచ్చు. ఏం? కొంచెం శ్రమపడండి. మీకు పనేమీలేదుగా?"

"ఊఁ!"

డిన్నర్ పార్టీ బాగానే వుంది. ఎటొచ్చీ—'నిరుద్యోగి' అని పరిచయం చెయ్యబడుతుంటే హరిప్రసాద్‌కి బాధ అనిపించింది. ఉద్యోగాన్వేషణలో ఉన్నాడని సున్నితంగా చెప్పవచ్చుగా? ఖైదీ...దొంగ...అన్నట్లు నిరుద్యోగి ఏమిటి? అది తప్పిస్తే—చక్కటి తీరులో గడిచింది డిన్నరు. వచ్చి—నిద్రపోయాడు. లేచేసరికి ఎక్కువ వేళ అయింది. ఎందుకనో ఆనంద్ అప్పటికే లేచి బద్ధకంగా మంచంమీద దొర్లుతున్నాడు.

"హరీ!"

"ఊఁ."

"మరేమీ అనుకోకపోతే-మెస్‌కి వెళ్ళి తొందరగా కాఫీ పంపమని చెప్పగలవా? లేచేసరికి కాఫీ లేకపోతే పిచ్చెక్కినట్లుంటుంది నాకు. అసలు కాఫీ వస్తే కాని లేవనందుకే...ఇవ్వాళే..."

అప్పటికే ఆ గదినుంచి వెళ్ళాడు హరి. కుక్-కుర్రవాడు లేడని తను పొయ్యి వదిలి రాలేననీ చెప్పి-ఫ్లాస్కులో పోసి హరికే యిచ్చేశాడు పట్టుకెళ్ళమని.

"థాంక్యూ! ఆ కప్పులో పోసివ్వు త్వరగా."

కప్పు బాగులేకపోతే కడిగి-కాఫీ పోసి యిచ్చాడు.

"నువ్వూ తాగు" అన్నాడు ఆనంద్.

# 2

సాయంత్రం...సముద్ర తీరంలో కూర్చున్నాడు హరిప్రసాద్ ఒక్కడూ. అతవికి వంటరితనం చాలా హాయిగా ఉంది. స్వేచ్ఛగా ఊపిరి పీల్చుకోగలుగుతున్నాడతను. గడచిన రోజులనీ, ఎదురయిన అనుభవాలనీ నెమరువేసుకుంటూ ఆలోచించడం అతని కలవాటు. ఇప్పుడూ అదే చేస్తున్నాడతను.'హాపీ హెవెన్'లో ఈ నెల్లాళ్ళలోనూ ఎదురుపడిన పరిస్థితులనీ అనుభవాలనీ బేరీజు వేసుకుంటూ తానేమిటో తన స్థానమేమిటో అంచనా వేసుకుందుకు తెగ ప్రయత్నిస్తున్నాడతను. స్నేహంలోని తీపితో పాటు చేదు కూడా రుచి చూశాడతను.

రఘు-"మీకు వేరే పనేమీలేదుగా? త్వరగా రాసెయ్యండి... బహుమతి వస్తే ఫిఫ్టీ-ఫిఫ్టీ..." తనకి పనిలేదూ? తను మాత్రం వ్రాత పరీక్షకి ఇంటర్వ్యూకి తయారు కానక్కర్లేదూ? విజావికి-ఆఫీసు తప్పితే-మరేం పనుంది అతనికి? పేకాటలో గంటలు గంటలు తగలెయ్యకపోతే తానే పెయిరు చేసుకోవచ్చుగా? తన సమయం అంటే ఎందుకతనికంత నిర్లక్ష్యం? కాలం—తనకి మాత్రం విలువైనది కాదూ?

వాళ్ళతోపాటే తనకీ కాఫీలు...సిగరెట్లు...

"వొద్దండీ! నేను సిగరెట్ కాల్చను. అలవాటు లేదు."

"అలవాటు లేకపోతే చేసుకోండి. సిగరెట్ కాలిస్తే మంచి ఐడియాలు, ఇంగ్లీషు మాట్లాడమూ చేతనౌతాయి. ఓహో! ఉద్యోగం లేదనా మీ భయం? డోన్ట్ వర్రీ. మేమందరమూ వుండి మీకు సిగరెట్లు కరువుకానిస్తామా! ఇన్‌సల్ట్..."

ఒకరి తరవాత ఒకరు తెగ బలవంతంచేసి మొహమాట పెట్టేశారు. వాళ్ళు వుద్యోగస్తులు. ఆ పైన తను వాళ్ళమీద ఆధారపడి, ఆశలు పెంచుకుని ఉన్నాడు. మొరటుగా తిరస్కరిస్తే

ఏమనుకుంటాకో అని-తప్పనిసరిఐ—సిగరెట్ కాల్చాడు...మెల్లగా అది అలవాటయ్యేవరకూ ఊరుకోలేదు వాళ్ళు. ఇప్పుడు...భోజనం చెయ్యగానే...కాఫీ తాగగానే తనకే సిగరెట్ కాల్చుకోవాలని పిస్తుంది. కాలుస్తున్నాడు కూడా! తనకి-సిగరెట్ అలవాటు! మానెయ్యాలి...ఎంత త్వరగా వీలయితే అంత త్వరగా. తలకొకటి లేదు కానీ మెడకో డోలన్నట్లు తనలాటివాడి కిటువంటి అలవాటేమిటి? కాని-వీళ్ళు తనని మాననిస్తారా? నమ్మకం లేదు.

"చూశారా గురువుగారూ! సిగరెట్ కాలుస్తూ రాస్తుంటే ఎంత చకచక సాగుతూందో! సిగరెట్‌లో సీక్రెట్ అదే. మనిషిలో లేని ఉత్సాహాన్నిస్తుంది. సీరియస్‌గా ఏ పని చెయ్యాలన్నా సిగరెట్ యీజె మస్ట్! స్త్రీ తరువాత సిగరెట్టే మగాడి ముఖ్యావసరం."

అవి—రఘు మాటలు. ఆ వేళ వాళ్ళు పేకాడుకుంటూంటే తను రాస్తున్నాడు. పేకాట వాళ్ళు ఒకటే గోల-"సిగరెట్లయిపోయాయ్... సిగరెట్లయిపోయాయి. సిగరెట్టు లేనిదే జోకరయినా కట్ కాదు. ఎలా? పేకాట ఆపెయ్యవలసిందేనా?"

"ప్రసాద్! కొంచెం అలా వెళ్ళి మీకూ, మాకూ సిగరెట్లు తెప్పిస్తారా?"

ఈరాచమర్యాద దేనికి? వెళ్ళి తెమ్మని సూటిగానే అడగొచ్చుగా? వొళ్ళు మండిపోయింది తనకి. తను-వాళ్ళ మీద పడి తింటున్నాడగానే వాళ్ళకి తనంటే అంత అలుసు? కాకపోతే తనని నౌకరులా భావించి సిగరెట్లకి పంపే ధైర్యమెక్కడిది వీళ్ళకి? ఛీ-ఛీ. ఎంత లోకువ ఐ పోయాడు తను? తనదే పొరపాటు వాళ్ళ మధ్య ఉండడం. తిట్టుకుంటూ వెళ్ళి సిగరెట్ పెట్టెలు తీసుకు వచ్చాక-"అలా ఉన్నారేం డల్‌గా? సిగరెట్ కాల్చి చాలా సేపయిందా? గుడ్! లైనులో పడ్డారు. కమాన్-రిబ్బన్ కట్ చేసి-తొలి సిగరెట్ కాల్చండి. క్విక్" అంటూ జరిగినదంతా మరచిపోయేలా జోకులు వేసేస్తూ తను మొదట కాల్చితే కాని వాళ్ళు సిగరెట్లు తీసుకోలేదు. ఏమనుకోవాలి వాళ్ళని? ఏదేమయినా వాళ్ళు తనకి సిగరెట్ అలవాటు చేసేశారు. వాళ్ళ మధ్య ఉన్నంత కాలం తను మానేద్దామనుకున్నా వాళ్ళు మాననివ్వరు. సిరి అబ్బక పోయినా చీడ అబ్బుతుందంటారు-యిదే కాబోలు!

* * *

అదిటప్పారావుకి సినిమాల పిచ్చి. తీరుబడి ఉండాలే కాని సినిమాకి వెళ్ళకొడన్న మాటే! రాచ పీనుగ తోడు లేకుండా వెళ్ళదట. అప్పారావుకీ సినిమాకి తోడు కావాలి. ఆఫీసు వాళ్ళేమీ అవరో ఏమో-మధ్యాహ్నం వొచ్చి మ్యాట్నీలకు వెళ్తాడు. ఆ వేళలో తను దొరికిపోతాడు. ఇంకెవరూ ఉండరు 'హాపీహెవన్'లో.

"సినిమాలు మానసోల్లాసం కలిగిస్తాయి. ఇంతో అంతో తెలివితేటలు కూడా వికసింపజేస్తాయి. మంచి భాష వస్తుంది. మెదడు పదునెక్కుతుంది. ఒక్కో సినిమా చూస్తూంటే మనకి తెలియని-ఊహించలేని విషయాలెన్నో తెలుస్తూంటాయి. హాయిగా కూర్చుని-ఉపయోగకరంగా కాలం గడపొచ్చు. తెరమీద బొమ్మ కదులుతూండేంత వరకూ మనం యీ ప్రపంచాన్నే మరచిపోవచ్చు. బాధలు మరచి పోవచ్చు."

"మీకు-బాధలా!"

"నేను మనిషిని కాదూ!" విషాదంగా నవ్వాడు. "నా బాధలు ఎవరికీ చెప్పుకోలేనివి."

అడగడం బాగుండదని తను మౌనంగా ఊరుకున్నాడు.

"మా చెల్లెలు-పదహారో యేట వంచించ బడింది. దానితో ఆమెకి పెళ్ళి కాకుండా పోయింది. కుటుంబానికి మచ్చ పడింది. రెండో చెల్లెలు ఎంత బుద్ధిగా ఉన్నా అవివాహితగానే వుండిపోవలసి వస్తూంది. ఈ బెంగతో అమ్మా నాన్నల ఆరోగ్యం చెడింది. చూడండి-ఈ విషయాలెవరికీ తెలియవు-మనవాళ్ళకీని. ఎందుకో మీ ముందు దాచలేకపోయాను. మనసులో ఉంచుకోండి" అన్నాడు.

"ఊఁ!" అని అప్పారావు వంకతిరిగి- "ఆ వూరు వదిలేసి మరో వూరు మకాం మార్చి చూడలేక పోయారా! స్థలం మారిస్తే కొంత ఉపయోగం ఉండేదేమో!" అన్నాడు.

"అన్నీ అయ్యాయి. లాభంలేక పోయింది. మనవాళ్ళు వంశ ప్రతిష్ఠకిచ్చే ప్రధానంలో సగమయినా వ్యక్తి విలువకివ్వరు. అక్క చేసిన నేరానికి-చెల్లెలు బలికావలసిందే! నిజానికి సుశీలది ఏమీ తప్పు లేదు. ప్రేమ ప్రేమంటూ అతను వెంటబడితే నిజమే అనుకుని అమాయకంగా అతనితో వెళ్ళిపోయింది. నెల్లాళ్ళయ్యేసరికి అతను

తోకముడిచేశాడు. అటువంటప్పుడు ఆత్మహత్య చేసుకోవాలని కూడా తెలీక అమాయకంగా యింటికి వొచ్చేసింది."

"అప్పారావుగారూ! మీ ఉద్దేశం ఏమిటి? మీ చెల్లెలు ఆత్మహత్య చేసుకోవాలనా?"

"ఆమె-యింటికి రాకపోతేనే బాగుండేదేమో అనిపిస్తుంది యింటి పరిస్థితి చూస్తుంటే. నేనెంత బాధ అనుభవించాక యీ మాట అన్నానో మీకు తెలియదు." ఇంక ఆ విషయం వదిలెయ్యడమే మంచిదనిపించింది తనకి. చేతనయితే ఎదుటి వాడిని నవ్వించగల గాలి కాని, తీరి కూర్చుని అతన్ని బాధించే గతాన్ని కెలకడం దేనికి?

"ఎవరితోనూ అనకండేం! ఇక్కడ నా పరువు పోతుంది." మళ్ళీ హెచ్చరించాడు.

"నే నటువంటి వాణ్ని కాను."

"అందుకే మీకు చెప్పాను. మీరు చాలా మంచి వారనీ, నమ్మకస్తులనీ నాకు తెలుసు."

"కృతజ్ఞతలు!"

"ఎంప్లాయ్‌మెంట్ ఎక్చేంజిలో తెలిసి నతను ఉన్నాడు. మీకేం సాయంకావలసినా నన్నడగండి. చేయిస్తాను."

"అలాగే."

"ఈసారెప్పుడయినా తీరుబడిచేసుకుని అతనిదగ్గరకు వెళ్దాం."

సంతోషం వేసింది. అప్పారావెంత మంచివాడు! పైకి చాలా బోళాగా కనిపించే యీ మనిషి వెనుక-బాధాకరమైన చరిత్రా ఉంది, మంచి మనస్సూ ఉంది.

"మిమ్మల్ని అస్తమానం కంపెనీ-కంపెనీ అంటూ సినిమాలకు తీసుకుపోతూంటే మీరేమీ అనుకోడంలేదుకదా? ఏం చేసేది? ఒక్కణ్ణీ ఉంటే యిల్లూ, చెల్లెళ్ళూ జ్ఞాపకం వొస్తారు. మరోమనిషి ఉంటే అన్నీ మరచి పోగలను. ఐనా—మీకు పనేమీ ఉండదుగా? అందుకే చనువుగా లాక్కుపోతాను."

కడివెడు పాలలో చిటికెడు ఉప్పువేసినట్లు ఆ చివరిమాట! తనకి పనుండదూ? తను నిరుద్యోగి అనా-తన కాలానికి విలువలేక పోడం? నిజానికి-వాళ్ళకంటే తనకే ఎక్కువ పని. లైబ్రరీకి వెళ్ళి

వాంటెడ్ కాలమ్స్ వెదుక్కోవాలి-పేపర్లలో. దరఖాస్తు చేయడ మంటే అదో యజ్ఞమే. ట్రూకాపీలు, అటెస్టేషన్లూ వగైరా. ఆ తరువాత ఆ పరీక్ష కవసరమైన పుస్తకాలు సంపాదించి బాగా చదవాలి. ఇదంతా పనికాదూ? నాలుగంకెలు అటూ యిటూ వేసి గారడీ చేసేసి-ఐపోయిందనిపించే అప్పారావుకి ఎక్కువ పనా? తనకి ఎక్కువ పనా?

# 3

"సెక్స్‌లోంచి పుట్టి సెక్స్ కోసం బ్రతుకుతూ-సెక్స్‌ని ప్రేమించక పోడం మూర్ఖత్వం. సెక్స్ అంటే సౌందర్యం. ఎ థింగాఫ్ బ్యూటీ యీజ్ జాయ్ ఫరెవర్. అసలు-సెక్స్‌నేది ఎక్కువ మానసికమూ, తక్కువ శారీరకమూ. తృప్తిపడవలసింది మనస్సు-శరీరం కాదు. ప్లాటోనిక్ లవ్ అంటే అర్థమేమిటి? మలభాండమయిన శరీరంతో పొందే సుఖంకంటె మనస్సుతో అనుభవించే ఆనందం-అద్భుతమూ అమూల్యమూ అపురూపమూ. సత్యం....శివం....సుందరం....సౌందర్యం-పరాకాష్ఠ. నేను మెచ్చుకునేది దానినే. నాకు తెలుసు-మీరు నన్ను పిచ్చివాడను కుంటారని. కాని-గురువుగారూ! ఓ చిత్రం చెబుతాను వినండి." ఆవేళ తను శంకర్ తెచ్చిన కొత్త సెక్స్ ఆల్‌బమ్ చూడడానికి ఎక్కువ ఉత్సాహం చూపక పోయేసరికి అతను ఎంతో ఫీలయిపోయి-హితోపదేశం చేస్తున్నట్లు యిచ్చిన బ్రెయిన్ వాష్! ఓపిగ్గా విన్నాడు తను, వినదగు నెవ్వరు చెప్పిన....ఏమి చెప్పినా సరే అన్నట్లు.

"నేను కాబరేలకు వెళ్తాను. బ్లూఫిల్మ్స్ చూస్తాను-అవకాశం దొరికితే."

"బ్లూఫిల్మ్! ఏమిటది?"

"మా పరిభాషలో-విప్రనారాయణ. మిమ్మల్ని చూస్తుంటే జాలేస్తుంది. ఈ కాలంలో బి.కామ్. పాసయి బ్లూఫిలిమంటే ఏమిటని అడుగుతున్నారా? మిమ్మల్ని చాలా సంస్కరించవలసి ఉంది. రేపు మధ్యాహ్నం మూడింటికి రెడీగా ఉండండి. ప్రోగ్రాం ఉంది. అదలా

ఉంచండి. స్వదేశీ విదేశీ సెక్సు బొమ్మలు చూస్తాను. పుస్తకాలు చదువుతాను. వీటి వల్ల నాకు అపరిమితానందంకలుగుతుంది."

"నీచ వాంఛలు రేగవూ?"

"వాంఛకు నీచమేమిటి?"

"పోనీ....ఉద్రేకం?"

"అదేగా ఆనందం!"

"కోరిక తీరక నరాలు బాధించవూ?"

"ఉహూం-మానసికానందమే నాకు పరాకాష్ఠ."

ఆశ్చర్యంగా చూశాడు తను. "మీరు ప్రకృతికీ సహజత్వానికీ దూరం కావడం లేదూ? మీ మనస్సులో, ఆలోచనలో ఏదో లోపం ఉందేమో తెలుసుకోలేక పోయారా?"

విసిపించుకోనట్లు నవ్వి-"చిత్రమయిన సంగతి చెబుతాను వినండి. ఒకనాడు థియేటర్‌లో 'బ్లోహాట్-బ్లోకోల్డ్' పిక్చరులో ఒకామె తారసపడింది. ఫోటోలలో స్త్రీ అంత అందంగా ఉంది. కాంతివంత మయిన వొంటి రంగు. చక్కగా పుష్టిగా ఉన్న శరీరం. మంచి స్ట్రిక్చరు. కళ్ళు కోరికతో నిండి ఉన్నాయి మత్తుగా. కొంచెం ప్రయత్నానికే ఆమె నాకు దగ్గర ఐపోయింది. ఆమె అనుమతితో ఒక హోటలు రూముకి వెళ్ళాం. గది తలుపు వేస్తూనే ఆమె సిగ్గు నంతటినీ అవతల వదిలేసింది కాబోలు-నా ముందు-అంతకు మునుపు ఏ మాత్రమూ పరిచయంలేని నా ముందు-ఎవరూ కాదు-నేనే నమ్మలే నట్లు-చాలా విప్పంకోచంగా-ఫ్రీగా కదలసాగింది. ఆమె శరీరం-బట్టలనీ, సంకోచాల్నీ వదుల్చుకుంది. చక్కని భంగిమలో వీనస్‌లాటి కదలికలు. ఆమె—సౌందర్యానికీ ఆరోగ్యానికీ కోరికకీ కాణాచి. ఆ శరీరం నున్నగా మెరుస్తూ-ఆ చక్కని వొంపులు అందంగా వీడలు పడుతూ! ఆమె సౌందర్యానికి జోహారుచేశాను. వివరాలు వదిలేస్తాను. ఆమెను- ఆ వీనస్‌ని అనుభవించాను. నా నరాలవేడీ, గుండెల వేగమూ సర్దుకున్నాయి. శాంతపడ్డాయి. ఆమె-బెడ్ మీదే ఉంది. ఎలా ఉన్నా, అదే- ఓసుందర భంగిమను చూశాను. ఆశ్చర్యపోయాను. నా కళ్ళు నన్ను మోసం చేయడం లేదుకదా? నేను నేనూ, ఆమె ఆమేనా? జరిగింది నిజమా-జరుగుతున్నది నిజమా?"

"ఏమయింది?" ఆత్రంగా అడిగాడు తను ఉత్కంఠని భరించలేక.

"ఆమె అందమంతా ఏమైపోయిందో తెలియదు. ఆమె-పెద్ద మాంసం ముద్దలా, అసహ్యంగా. జుగుప్సగా కనిపించింది."

"ఆ! అదేమిటి?"

"అనలైజ్ చేసి చూసుకుంటే తరువాత అర్థమైంది."

"ఏమిటి? ఆమె అందం మేకప్ అనా?"

"కాదు- ఆమె ఎప్పుడూ సౌందర్యవతే. కోరిక నాలో ఉన్నంత సేపూ- నా కళ్ళు, హృదయమూ ఆమె సౌందర్యాన్ని స్వాదించ గలిగాయి. కోరిక తీరి పోయాక, అనుభవం ఐపోయాక- అంత అందమూ అసహ్యమనిపించింది. దీనిని బట్టి తేలేదేమిటి? నిజమైన ఆనందం....పరమానందం....బ్రహ్మానందం అనుభవాని కందనంత వరకే అన్నమాట! అందుకేకాబోలు అంటాడు పినీకని- 'విరహమే సుఖమని....'"

"కాని- నీవని ప్రేమిస్తూ నిజాన్ని భరించలేక పోదం-బలహీనతా, అసహజమూ కాదూ?"

"ఏమో! ఆ అనుభవంతో నాకు సజీవమయిన స్త్రీ అన్నా, ఆమెతోడి అనుభవమన్నా వెగటూ వైరాగ్యమూ వచ్చేశాయి."

జాలివేసింది. సంభాషణ ఆపేశాడు. నిశ్చయంగా శంకర్‌ది మానసికవ్యాధే. ఏదో కాంప్లెక్సు. లేదా కాంప్లికేషను. కాని-తను అతనికి చెప్పినా వినడు.

మర్నాడు బ్లూ ఫిలిమ్‌కి తీసుకెళ్ళాడు. అంతా అతిరహస్యం! దొంగల్లా ఆ గదికి వెళ్ళారు. చీకటి....ఒక్కసారి తెరమీద బొమ్మ పడింది. సౌండు లేదు. బ్లూ ఫిలిమంటే తెలిపింది. స్త్రీ పురుషుల కామ క్రీడల నిస్సంకోచ ప్రదర్శనా చిత్రం. ఎవరి వొంటిమీదా నూలు పోగయినా లేదు. ఎవరూ తమ శరీరంలోని ఏ భాగాన్నీ దాచుకోడం లేదు. వాటి ప్రదర్శనే తమ ధ్యేయమూ ఆనందమూ అన్నట్లు నిర్లజ్జగా ప్రదర్శిస్తూ ప్రేక్షకులలో చవకబారు కోరికలను రెచ్చగొడుతున్నారు. బాహాటంగా కామ కేళి జరుపుతున్నారు. అరగంట సాగిన ఆ చిత్రంలో కథాలేదు, ఏమీలేదు- సన్నివేశాలు మాత్రమే.

స్త్రీ పురుషుల నగ్నత్వమూ, ఇరువురి రసకేళీ- అంతే! మొదట ఆ చిత్రం చూస్తూంటే సిగ్గేసింది. తరువాత సరదాగా అనిపించింది. చివరకి ఎప్పుడైపోతుందా అనిపించింది. ఆఖరున అసహ్యం వేసింది. ప్రేక్షకులు మాత్రం తెరమీది బొమ్మలకు హుషారిస్తున్నట్లు కామెంట్లు విసురుతూ తెగ ఎంజాయ్‌చేశారు.

బయటకు వచ్చాక ఓ యింటికి తీసుకువెళ్ళాడు తనని శంకర్. "ఇక్కడుండండి-నేను పని చూసుకువస్తా"నని ఓ గదిలో వదలి లోపలికి వెళ్ళిపోయాడు.

ఎవరో ఆమె కాఫీ పట్టుకు వచ్చింది చిరునవ్వు నవ్వుతూ. ఆమెతో మాట్లాడడానికి బిడియపడి కప్పు అందుకోబోతే ఆమె వేళ్ళు తగిలాయి. తను కాఫీ తాగేంతలో దీపాలు పోయాయి. ఆ చీకట్లో ఏం జరుగుతున్నదీ తెలియకుండానే అంతా జరిగిపోయింది. ఆమె తనని సెడ్యూస్ చేసిందా? ఎందుకు?

ఆమె లేచి చీర సవరించుకుని దీపం వేసి, "మీ ఫ్రెండ్ కంటె మీరు నయమే" అంది.

అర్థంకానట్లు చూశాడు ఆమె వంక. ఇప్పుడామె అంటే సంకోచమూ లేదు-గౌరవమూలేదు.

"ఆయనదంతా కంటి దురదే—వొంటి దురద ఉండదు" అనేసి వెళ్ళిపోయింది. ఎంత పచ్చిగా మాట్లాడింది అనుకుంటూంటే-నవ్వుతూ వచ్చాడు శంకర్.

తనకేమీ అనబుద్ధి కాలేదు.

"నిజం ఒప్పుకోండి. అనుభవం కంటె అన్వేషణే గొప్పది. శారీరకానందం కంటె మానసికానందమే మహత్తరమయినది."

వాటి సంగతి దేవుడెరుగు. తనకి లేని కోరి అవసరం అల వాటయింది. అంతవరకూ తనకి ఆ అనుభవం లేదు. నరమాంసపు రుచి మరిగిన పులిలాగ-స్త్రీ మీద కోరిక చెలరేగడం మొదలుపెట్టింది. ఆ తొలి అనుభవంతో ఆమె ఖరీదు పదిరూపాయలట. ఓ రాత్రి తను ఎంత బలహీనుడై పోయాడంటే—దాచుకున్న డబ్బులోంచి పది రూపాయలూ పట్టుకెళ్ళి-సుఖించి వచ్చేవరకూ నిద్రపట్టలేదు. తను-పతనమయ్యాడా? తన నిగ్రహం ఏమైంది? నిజంగా తను దురదృష్ట

వంతడు. కాకపోతే-శంకర్ తన కోసం ఆ పేళ పాతిక రూపాయల ఖర్చు చేసి బ్లూఫిలిమ్ చూపించడమూ, స్త్రీ అనుభవం రుచి చూపడమూ దేనికి? పాతిక రూపాయలూ తన మీద ఎంత అవలీలగా ఖర్చు చేయ చేయగలిగాడు! తను తిరిగి యివ్వలేడని తెలుసు. ఓహో! ఇదే కాలేజి స్నేహంలో చిత్రం. ఈ శంకరే తన నావాళ హోటలుకి వెళ్ళి కాఫీ తెచ్చి పెట్టమన్నాడు! దానితో అతని దృష్టిలో తానేమిటో, ఎవరో అర్థం కాలేదు. ఫ్రండా-నౌకరా?

# 4

ఆనంద్! నిజానికి అతనే తనకిక్కడ మొదటి స్నేహితుడు. అతని ద్వారానే అందరూ పరిచయం అయ్యారు. బ్యాంకులో ఆఫీసరు పనీ మిగిలిన వాళ్ళ కంటె తను అధికుడిననీ అతనికి అహం ఉంది. మాటలలో కాకుండా చేతలలో దానిని ప్రదర్శిస్తూంటాడు కూడా. అతను—రాను రానూ తనకి మరీ అందకుండా పోతున్నాడు. మాసిన బట్టలతో ఉన్నాడారోజు తను. అంతవరకూ ఓ జత కట్టుకుని మరో జత ఉతుక్కునేవాడు. టాప్ రాకపోడంతో బట్టలుండిపోయాయి.

"అదేమిటా బట్టలు నౌకరులా?" తేలిగ్గా అనేశాడు.

మనసు చివుక్కుమంది తనకి. అతను ఆనంద్ కనుక కానీ, మరెవరయినా అయితే చాచిపెట్టి ఒకటిచ్చేవాడే చెంప మీద.

"నీకు బట్టలు లేకపోతే బీరువాలోంచి తీసుకొని వేసుకో. అడుగు అరలో ఉన్నవన్నీ నా కవసరం లేనివీ-పనికి రానివే. వాళ్ళూ వీళ్ళూ అడుగుతూంటారని దాచాను."

తనకి-ఏడుపే వొచ్చింది. 'ఆనంద్! నేను ముష్టివాడిని కాను. నీ స్నేహితుణ్ని' అని గొంతెత్తి అరవాలనిపించింది. కాని అతను తన ముఖం చూడకుండానే అన్నాడలా.

"కొంచెం నా పరువు సంగతీ ఆలోచించాలి నువ్వు. నీకిక్కడ అన్నీ సరిగ్గా జరుగుతున్నాయా? లేకుంటే నాతో చెప్పు-చూస్తాను."

"అన్నీ బాగానే జరుగుతున్నాయి. నా ఉద్యోగం..."

"తొందరపడకు. ఉద్యోగమంటే బజార్లో దొరికేది కాదుగా యిలా వెళ్ళి అలా తెచ్చుకుందుకు? కొంచెం నిదానించు. నేనా విషయం మరచిపోలేను. గట్టి ప్రయత్నాలే చేస్తున్నాను" అన్నాడు ఆనంద్ కొంచెం కటువుగా. ఇక తనకి నోరు పెగలలేదు.

"ఆ రేజరిలా తీసుకురా!"

తీసుకువెళ్ళాడు. ఆనంద్ గెడ్డం గీసుకున్నాక-"నువ్వా క్రాట్టెయ్ ఆ చేత్తో. చూడు, హరీ! మనిషి స్మార్ట్‌గా ఉండాలి. నువ్వు స్మార్ట్‌గానే వుండేవాడివి. ఎందుకో యీ మధ్య నీ మీద నీకు శ్రద్ధ తగ్గిపోతోంది. నువ్వు రోజూ ఎందుకు షేవ్ చేసుకోకూడదు?"

ఎందుకు చేసుకోకూడదు- రోజుకొకసారి కాదు- రెండుసార్లు గెడ్డం చేసుకునే గొప్ప వాళ్ళు కూడా ఉన్నారు. కాని-తను నిరుద్యోగి. వారానికొక బ్లేడంటేనే తనకి శక్తికి మించిన ఖర్చు. రోజుకి రెండు సార్లంటే-తనని తనే క్షమించుకోలేనంత లగ్జరీ.

"ఇక నుంచీ తరచుగా గీసుకుంటాను" అన్నాడు తను.

"గుడ్! నీలోని ఉన్న మంచి లక్షణం అదే. ఓసారి చెప్పగానే తెలుసుకుంటావు."

'తెలుసుకోక ఏం చేయగలను? నీ నీడలో నీ మీద ఆధారపడి బతుకుతున్నవాడిని. నువ్వు ఉద్యోగం యిప్పిస్తావనే ఆశకొద్దీ భవిష్యత్తులో సుఖపడదామని-కళ్ళుమూసుకుని, మనసుని అభిమానాన్ని చంపుకుని వర్తమానాన్ని నెట్టుతున్న వాడిని. ఉద్యోగమూ సద్యోగమూ లేని వాడికి నాకు స్వంత అభిప్రాయాలూ, వ్యక్తిత్వమూ అంటే ఎలా కుదురుతుంది? అదీకాక-నీ పరువు నిలపవలసిన బాధ్యత నా మీద ఉందని గుర్తింపజేశావ్! నీ కోసం రోజుకోసారే కాదు-పదిసార్లయినా గెడ్డం చేసుకుని నీ ప్రిస్టేజ్ నిలుపుతాను. నీ పరువు నిలపడం కోసం వరండాలో చాప పరుచుకుని పడుకోవటం లేదూ రోజూ? అలాగే.'

ఆనంద్ అవివాహితుడే తప్ప బ్రహ్మచారి కాడు. సిటీలో ఉంటూ, సంపాదించుకుంటూ, సెక్స్ సినిమాలు చూస్తూ-ఏ యువకుడు బ్రహ్మచర్యం కోసం పాకులాడుతాడు? ఏ వొకడో అలాటివాడున్నా అతని స్నేహితులు ఊరుకోరు. కంపెనీ పేరిట తమతో పాటు ఏ

కంపెనీకో తీసుకుపోయి తీరతారు. ఒకటి రెండు సార్లలా జరిగాక యిక అతని ప్రిన్సిపుల్స్‌కి శాశ్వత సమాధే.

ఆనంద్ డ్రింక్ తీసుకోడమే కాదు, కాల్‌గర్ల్స్‌ని కూడా పికప్ చేసుకు వస్తూంటాడు రూముకి. స్నేహితురాలంటాడు మొహమాటానికి. కాపీ-మూసిన తలుపుల వెనుక సాగేది స్నేహం కాదని ఎవరికి తెలియదు?

"ఈమె-మిస్‌రోజీ! నా ఫ్రెండ్. ఈ రాత్రి నా గదిలో ఉంటుంది." అంతే అన్నాడు ఆనంద్. అర్థం చేసుకోలేని చిన్నపిల్లవాడేమీ కాడు తను. ఆ వేళకి రఘు రూములో పడుకున్నాడు. కాని-అదీ నేరమౌతుందని తనకేం తెలుసు? మర్నాడు ఉదయం-రోజీ వెళ్ళిపోయాక-తనూ ఆనందూ కాఫీ తాగుతూంటే అన్నాడు. "రాత్రి ఎక్కడ పడుకున్నావ్?"

"రఘు రూములో. ఏం?"

ఆనంద్ ముఖం అదోలా పెట్టాడు. "వాళ్ళు-అరాలు తీశారా?"

"నేను ఏమీ చెప్పలేదు."

"చూడు ప్రసాద్! రోజీ తరచు వొస్తూంటుంది. నువ్వు మరెవరి రూములోనో అస్తమానం పడుకుంటూంటే-నాకు నామోషీగా ఉంటుంది. నా స్నేహితుడివి నువ్వు." అర్థమయింది-పూర్తిగా తనని వరండాలో పడుకుంటూండమని అతని సూచన.

"మరోలా అనుకోకేం? నువ్వు స్నేహితుడివి కనుక చనువు తీసుకుంటున్నాను."

మరోలా ఎందుకనుకుంటాను? తలపంకించాను అర్థమైనట్లు, అర్థం చేసుకున్నట్లు.

ఆ నాటి నుంచి తన మకాం రాత్రులు వరండాలోకి మారింది.

ఓ సారి అప్పారావో-రఘో అడిగారు. "వరండాలో పడుకుంటున్నారేం?" అని.

ఓ నిముషం ఆలోచించి-"పల్లెటూరి అలవాటండీ! ఆరు బయట ఐతే కాని నిద్ర పట్టదు. ఎంత ఫ్యాను తిరుగుతున్నా గదిలో అవగానే ఊపిరాడనట్లుంటుంది" అనేశాడు.

కాని-నిజం వేరు. సిటీలో మనుషులలాగే దోమలూ ఎక్కువే.

ఫ్యానులనే వజ్రాయుధాలు లేకపోతే దోమలను జయించడం ఎవరి తరమూ కాదు. రాత్రంతా వాటిని చంపుతూ యుద్ధం చేస్తూ జాగారం చెయ్యవలసిందే. ఆ బాధ తనకి బాగానే అనుభవమైంది. ఇంట్లోకి దొంగలు రాకుండా తను వరండాలో కాపలా. తను-వాచ్ మన్. వారానికి ఏడు రోజులూ ఛోటీయో, జాస్మినో వొస్తూనే ఉంటుంది- ఆనంద్ రాత్రి స్నేహానికి. కనుక తనకి—వరండా, చాపా, దోమలే గతి. నిజానికివేవీ మనసుని నొప్పించే బాధలు కానేకావు. ఉండీ ఉండీ, తెలిసో తెలియకో వాళ్ళు చాలా తేలికగా మాట జారేస్తూంటారు. అటువంటప్పుడే తనకి తోక కోసి సున్నం పూసినట్లుండేది. ఆనంద్ తన ఆధిక్యతని అవలీలగా తన ముందు ప్రదర్శిస్తూంటే పిచ్చుక మీద బ్రహ్మాస్త్రం వేయకనాలనిపించేది. నిరుద్యోగి అయిన తనెక్కడ? ఆఫీసరయిన అతనెక్కడ? మళ్ళీ అంతలోనే-"చూడు హరీ! నీకు డబ్బు అవసరమయితే నిస్సందేహంగా తీసుకో. పర్స్ ఎప్పుడూ రూములోనే ఉంటుంది" అంటాడు.

ఇదుగో యిలా టప్పుడే తనకి విషసంధి ఎదురౌతుంది. తను కొన్ని గిరులు గీసుకుని ఆ రేఖలలో ఉందామనుకుంటాడు. ఆనంద్ ఉండనివ్వడు. గీతదాటిస్తాడు. పోనీ అవి తను దాటితే-హద్దు గుర్తు చేస్తాడు. ఈగేమ్ తను భరించలేకపోతున్నాడు. ఎప్పటికప్పుడే అర్థంకాకుండా పోయే గేమ్ అది. ఆనంద్ అంటే తనకి భయమే వేస్తోంది.

* * *

"హలో-హరిప్రసాద్!"

తనని పిలుస్తున్నదెవరా అని చూశాడు. శంకర్ద్వారా పరిచయమయిన స్నేహితుడు. పేరు ప్రకాష్. ఒకటి రెండు సార్లు పేకాటవద్ద చూశాడు కూడా.

"ఒక్కరూ వచ్చారు- మీ ఫ్రండ్సెవరూ రాలేదూ?" కూర్చుంటూ అడిగాడు.

"లేదండీ! ఒక్కడినే వచ్చా నేమీ తోచక."

"వాళ్ళలో ఎవరికయినా మీరు బంధువా?"

"ఉహుం. ఏం అలా అడిగారు?"

"మీ రెండులో జాబ్ చేస్తున్నారు?"

"ఇంకా ప్రయత్నంలోనే ఉన్నాను." సిగ్గుపడుతూచెప్పాడు.

"మీరు ఆ లాడ్జిలో ఉంటున్నారనగానే మీరూ ఎంప్లాయియీ అనే అనుకున్నాను. ఎంప్లాయీయీకారు, వాళ్ళెవరికీ రిలెటివ్వూకారు—మరెలా ఉంటున్నారు?"

"ఆనంద్‌కీ తద్వారా మిగిలిన వాళ్ళకీ స్నేహితుణ్ని. నాకు ఉద్యోగం వచ్చేదాకా తమతో ఉండమన్నారు. వాళ్ళూ ప్రయత్నిస్తూనే ఉన్నారు."

ఆశ్చర్యంగా చూశాడు ప్రకాష్. "అంటే వాళ్ళు మిమ్మల్ని భరిస్తున్నారన్నమాట!?"

హరిప్రసాద్ ముఖం ఎర్రబడిపోయింది. ఈ విషయాలన్నీ యాతని కెందుకు? ఇతని కెవరిచ్చారీ అధికారం-తన నిలా మాటలతో హింసించేందుకు?

"ఇతరుల విషయాలలో అనవసరపు కుతూహలం మంచిది కాదు."

"అనవసరమా? ఓహ్! మిమ్మల్ని బాధించడం నా ఉద్దేశం ఎంత మాత్రమూ కాదు. సారీ! వాళ్ళు మీతో ప్రవర్తించే తీరు కొంచెం భిన్నంగా అనిపించింది. అందుకని అడిగాను. చూడండి ప్రసాద్! నేను మీ శ్రేయోభిలాషిని."

"థాంక్స్!" కోపంగానే అన్నాడు హరి.

"మీకు కొన్ని నిజాలు చెప్పదలుచుకున్నాను. వింటే మీకే మంచిది. అఫ్‌కోర్స్—చేదుగా ఉంటాయనుకోండి. మీరు చెప్పమంటేనే చెబుతాను. వింటే మీకే మంచిది."

కొంచెం ఆలోచించి అన్నాడు. "సరే చెప్పండి-వీ:యినంత సున్నితంగా."

"మీరు ఆనంద్‌కి స్నేహితులు. అలాగే ఆనంద్ స్నేహితులకి స్నేహితులయ్యారు. ఔనా? మిమ్మల్ని వాళ్ళంతా కలిసి భరిస్తున్నారు. మీ ఖర్చులు తాము పెట్టుకుంటున్నారు. కాని వాళ్ళు మిమ్మల్ని పూర్తిగా స్నేహితుడిలా గౌరవంగా చూస్తున్నారా అని?"

"........."

"నేను గ్రహించకపోలేదు. మీ మీద వాళ్ళు సున్నితంగా చెప్పాలంటే అధికారమూ ఆధిక్యతా ప్రదర్శిస్తున్నారు కదూ? నేను స్వయంగానే చూశాను. ఒక విషయం వినండి—ఇదేమీ బంగారు కాలంకాదు. స్నేహం కొద్ది వాళ్ళు మిమ్మల్నాదరించడం లేదు. అంత మంచి స్నేహానికివి రోజులు కావు ఇవి ఎటువంటి రోజులు? ఎదుటి మనిషితో మాట్లాడాలంటేనే మనకెంత వరకూ లాభమని వ్యాపారాత్మకంగా ఆలోచించే డబ్బురోజులు. అటువంటిది—వాళ్ళు ఊరికే మిమ్మల్ని కూచోబెట్టి పోషిస్తున్నారంటే నేను నమ్మలేక పోతున్నాను. చెప్పండి-మీరుచేసే ఏయే పనులకి ప్రతిఫలంగా?"

"ప్రకాష్!" అసహనంగా చూశాడు ప్రసాద్. "మీకు స్నేహం అంటే తెలీనట్లుంది." అలా అన్నాడేకాని అతనిలో ఒక్కసారి చాలా సంఘటనలు చేదుగా మెదలకపోలేదు.

• • •

ఆవేళ తను తన బట్టలుతుకుతూంటే రఘు వొచ్చి—"ప్లీజ్! ఆ చేత్తోనే నా కర్చీఫ్ కూడా....ఏమనుకోకండి-రేపటికి రుమాలు లేదు. నాకు వాషింగ్ సోపంటే అలర్జీ."

అప్పారావు రూముకి సున్నం వేయిస్తానన్నాడు ఓనరు—గోడలు మరీ పాడుగా ఉన్నాయని.

"నేను ఆఫీసుకి పోయాక వేయించండి. సున్నపువాసనా, దుమ్మూ నాకు పడవు."

"మరి మీ సామాను సర్దడం సంగతేమిటి?"

"ప్రసాద్‌ని అడుగుతాను. అతను చూస్తాడు"

"అతను ఒప్పుకుంటాడా?"

"ఎందు కొప్పుకోడు? ఏమండీ! మీరు నా గదికి సున్నం వేయించరూ?" అధికారంగానే అడిగాడు అప్పారావు. తనేమీ అనలేక పోయాడు. అంగీకరిస్తున్నట్లు తలూపాడు. అప్పారావు గది తనే సర్దాడు సున్నంవేసేదాకా. ఆ వేళంతా ఆ పనితోనే సరిపోయింది.

శంకర్‌కి గెస్టువస్తే స్టేషనుకి వెళ్ళి టికెట్ కొని అతన్ని రైలెక్కించి వచ్చాడు.

ఏం చేస్తాడు? శంకర్ ఆజ్ఞాపించినట్లే చెప్పాక.

ఆనంద్‌కి రేజర్‌సెట్ ఎన్ని సార్లు సిద్ధంగా అమర్చి ఉంచ లేదు టేబుల్‌మీద. అంతేనా? ఆవేళ అర్ధరాత్రి తనని లేపి, "రోజీకి తల నొప్పిగా ఉందట. కొంచెం అలా వెళ్ళి కాఫీ తీసుకురావూ?" అంటే నిద్రకళ్ళతో వెళ్ళి తేలేదూ?

భోజనాల దగ్గర మరీ బాధ. ముందు వెళ్తే-"ఆఫీసుకి టైమై పోయిందనా పరుగెత్తుకు వచ్చేశారు?"—నలుగురితోనూ వెడతే- "ఒక్కసారే అందరికీ వడ్డించడం నాకు చేతకాదు." ఆలస్యంగా వెళ్తే- "మీ ఒక్కరికి వడ్డించేందుకు మళ్ళీ లేవలేను- పెట్టుకు తినండి దొర గారు" అంటాడు కుక్. నిరుద్యోగి అంటే వాడికీ లోకువే మరి.

అదీ కాక వాడికి తన మీద కోపం. ఎందుకంటే-

"ఈ నెల మెస్‌బిల్ చాలా ఘోరంగా పెరిగిపోయింది" అన్నాడు శంకర్ లెక్కలు చూపుతూ భోజనాల హాలులో, అందరూ కుక్ వంక చూశారు ఏం చెబుతావన్నట్లు. వాడేమో తన ముఖం వంక చూశాడు. ఆ చూపుకి అర్థం ఓ మనిషెక్కువయ్యాడు కదా అని. తనకి నెత్తి గోడకేసి కొట్టుకోవాలనిపించింది. అప్పుడు ఆంగ్లంలో మాట్లాడ్డం మొదలు పెట్టారు నలుగురూ. సారాంశం— తను ఉద్దేశం కుక్ చాటు మాటుగా సామాను చేరేస్తున్నాడేమో అనీ, దొంగ బిల్లులు చూపెడుతున్నాడేమో అనీట. అంతేకాని తన గురించి కానే కాదుట. వాళ్ళొక సూచన చేశారు. "ఎలాగూ హరిప్రసాద్ ఖాళీగా యింటి దగ్గరే ఉంటాడు కాబట్టి పర్చేజెస్‌కి కుక్‌తో వెళ్ళడమూ, స్టోర్ రూము ఛార్జి తీసుకోడమూ చేస్తే బాగుంటుంది."

"ఆ పనులు నాకు తెలియవు" అన్నాడు తను.

"అవేమయినా బ్రహ్మవిద్యలా? ఈ మాత్రం చేత కాకపోతే రేప్పొద్దుట ఏం ఉద్యోగం చేస్తారు?"

ఎత్తి పొడుస్తున్నట్లే అన్నారామాట. అందుచేత ఆ డ్యూటీ తప్పని సరిగా అంగీకరించవలసి వచ్చింది. ఒక రోజు కుక్‌తో బజారుకి బయలుదేరాడు. వాడు దొంగ బిల్లులు రాయమంటూంటే తను వారించబోయాడు. వాడు ఉపన్యాసం లంకించుకున్నాడు.

"వాళ్ళు నీకేమయినా బంధువులా-చుట్టాలా? వాళ్ళు పారేసే

ఎంగిలి మెతుకులకోసం నువ్వు చేస్తున్న చాకిరీ చాలులే. నాకు మిగిలే డబ్బుల్లో నీకూ వాటా యిస్తాను. రేపటినుంచి నీకు స్ట్రాంగ్ కాఫీ యిస్తాను. స్పెషల్ నెయ్యి వేస్తాను. మనమూ మనమూ సర్దుకు పోవాలి. నువ్వు సై అంటే దర్జాగా నీ పై ఖర్చు వెళ్ళిపోతుంది. వల్లకుండు." వాడు తనని సమానుడిగా భావించి మాట్లాడ్డంతో తనకి కోపం వచ్చింది. అయినా నిగ్రహించుకుని- "మోసం చెయ్యడం తప్పు. జీతం కావాలంటే పెంచమని అడుగు" అన్నాడు సాధ్యమైనంత శాంతంగా.

"బయలుదేరాడు ధర్మరాజు-గడ్డిమేటు దగ్గర కుక్కలా. తను తినడు, ఒకళ్ళని తిననివ్వడు. వాళ్ళకి లేని తాపత్రయం యితగాడి కెందుకో!" గొణుక్కోసాగాడు కుక్. తను మెంబర్స్‌కి జరిగినది చెప్పాడు. అంతా విని- "ప్చ్-వదిలేయండి. ఇప్పుడు వీణ్ని పంపేస్తే మళ్ళీ మరొకడి కోసం వెతుక్కోవాలి. ఆ బాధ ఎవడు పడతాడు? ఏదోలా జరిగి పోతూంది కదా?" అనేశారు.

తనకి నవ్వూ, ఏడుపూ రెండూ వచ్చాయి. ఈ మాత్రం దానికి ముందు ఎందుకలా అనాలి? ఏదేమయినా తనకీ కుక్‌కీ వైరభావం ఏర్పడి పోయింది. తను-వాడికి కూడా లోకువై పోయాడన్నమాట. అవును—వాడు ఏదో ఓ ఉద్యోగం అంటూ చేస్తున్నాడు. తనకదీలేదు. అందుకే వాడు కూడా తనని గడ్డి పోచలా తేలిగ్గా భావించాడు.

ఉద్యోగం పురుష లక్షణం అన్నారు కానీ అంతకంటె ఉద్యోగం మానవలక్షణం అని ఉంటే పూర్తిగా నిజమై ఉండేది. ఉద్యోగం లేని వాణ్ని మనిషిగానే జమకట్టరు యీ రోజుల్లో. చివరకి పెద్దవాడయిన సత్యన్నారాయణ కూడా అలాగే ప్రవర్తించే సరికి తను తలకిందులే అయిపోవలసి వచ్చింది.

ఆవేళ తను జనరల్‌నాలెడ్జి బుక్ చదువుకుంటున్నాడు. లాడ్జిలో ఎవరూ లేరు.

"చూడు హరీ! చుట్టాలొచ్చారు కొంచెం బజారు కెళ్ళి కూరలు తెచ్చిపెట్టవూ?"

పోన్లే-పెద్దవాడని సంచీ డబ్బులూ తీసుకుని వెళ్ళి తెచ్చాడు. రేట్లు చెప్పి డబ్బు లెక్కచెప్పి కూరలసంచీ చిల్లరా యిచ్చే సరికి-

"అదేమిటోయ్-అంతంత ఖరీదు పెట్టేశావ్? కూరలు కూడా బాగు న్నట్లులేవు ఇలా అయితే ఎలా? చెప్పిన పని బాధ్యతాయుతంగానూ సరిగ్గానూ చెయ్యాలి. కూరలు కొనడమే గానివాడివి ఉద్యోగమూ, సంసారమూ ఏంచేస్తావ్? చూడు! రోజూ వెళ్ళి కూరలు తీసు కొస్తూండు. ఎలాగూ నీకు పనేమీ లేదుగా? అనుభవనూ వస్తుంది, నాలుగు విషయాలు తెలియనూ తెలుస్తాయి" అన్నాడు తనకి అత నేదో ఉపకారం చేసేస్తున్నట్లు.

తనకి కోపం వచ్చినా-"మీ బంట్రోతుంటాడుగా, నేనెందుకు లెండి బజారు చెయ్యడం?" అన్నాడు చాలా నిగ్రహించుకుంటూ.

"వాడు దొంగ వెధవోయ్! బంట్రోతులని బజారుకి పంపడం తెలివి తక్కువే. వాడికంటె నువ్వే నయం కొత్తయినా కొంత చవగ్గానే తెచ్చావు. రేపటినుంచి యింట్లో అడిగి బజారు పనిచేసి పెట్టు. అలా షైర్ వెళ్ళినట్లు వెళ్ళొస్తూండు!" ఆజ్ఞలా అనేసి వెళ్ళిపోయాడు ఓనరు సత్యన్నారాయణ.

తనకంతా అయోమయంగా అనిపించింది.

ఉద్యోగం లేనంత మాత్రాన ప్రతివాళ్ళకీ తన మీద అధికారం వచ్చేస్తుందా? సత్యనారాయణని కాదంటే ఏం జరుగుతుంది? తన అద్దెగదులలో ఉండొద్దంటాడా? తను అనందూ వాళ్ళకి గెస్టుకాని అతనికి కాదుగా?

ఏమో! ఇంటి యజమానిగా పవరుచూపెట్టి 'హరిని పంపెయ్యక పోతే మీరూ ఖాళీ చేసెయ్యండి అంటాడేమో!'

అలా జరిగితే—ఆనంద్ కానీ మిగిలిన వాళ్ళు కానీ తనని వదుల్చుకుంటారేమో తప్ప, అన్ని విధాలా అమరిన యింటిని ఖాళీ చెయ్యరు. కనుక చచ్చినట్లు—తను సత్యనారాయణని కూడా సేవించ వలసిందే-తప్పదు.

తన జీవితమే ఏనుగు గండం నూరేళ్ళాయుష్షు అన్న మాదిరి తయారైంది. అందరికీ తను సేవకుడు. వారికి ఆగ్రహం కలగ కుండా, అనుగ్రహం సంపాదించుకుంటూ యీ అరణ్యవాసము పూర్తి చెయ్యాలి.

వెనకటికి—మొగుడు ముండా అంటే ముష్టివాడు కూడా

ముండా అనే అన్నాడుట. ఆనంద్ తనకి పనులు చెప్పడం చూసి ఒక్కొక్కరూ తనని సేవకుడిగా వినియోగించుకోడం మొదలు పెట్టారు. సత్యనారాయణ....చివరకి రోజీ కూడా!

ఎటువంటి బ్రతుకైపోయింది? మానాభిమానాలు వదులుకుని తనెందుకు యిక్కడ నికృష్ట జీవితం గడుపుతున్నాడు?

ఉద్యోగం కోసం...ఉద్యోగం దొరుకుతుందేమో అన్న ఆశతో.

పరిస్థితులకు తలవంచడం విజ్ఞుల లక్షణమే! కార్య సాధన కోసం ఎటువంటి కష్టనిష్ఠూరాలయినా భరించి తీరాలన్నారు పెద్దలు. పాలకోసం రాళ్ళు మోసేవారిని తను చూడలేదుకానీ, ఉద్యోగంకోసం వూడిగం చేసేవాడు మాత్రం తనే! సాక్షాత్తూ తనే!

తను-సేవకుడు కాని సేవకుడు! స్నేహితుడు కాని స్నేహితుడు!! మనిషి కాని మనిషి!!?

ఔను—తను నిరుద్యోగి.

# 5

"స్నేహం అంటే నాకు తెలుసు కనుకనే మీ మీద జాలిపడడమూ, నిష్ఠూరంగా అనిపించినా నిజం చెప్పడమూ మొదటి సారి మిమ్మల్ని చూడగానే అనిపించింది మీరు అమాయకులనీ, అభిమాన వంతులనీ. ఆవేళ మిమ్మల్ని హెచ్చరించాలనుకున్నాను. కాని—కొన్ని అనుభవాలయితే తప్ప మీరు నన్నూ నా మాటలనీ నమ్మరేమో అనిపించింది. ఇంతవరకూ నిరీక్షించాను. ప్రసాద్! మీరు ఆత్మ పరిశీలన చేసుకోండి. నిజంగా మీ కిక్కడ స్నేహితుడి హోదాయే లభిస్తోందా? ఆత్మవంచన చేసుకోకండి. నేను విలన్‌ని కాను. మనస్తత్వ పరిశీలన నాకు హాబీ. జీవితంలో చేదునీ, మనుష్యుల లోని బలహీనతనీ అనలైజ్ చేస్తూండడం నాకు సరదా. ఒక్కటి నమ్మండి. నేను మీకు మేలే చేస్తాను కాని కీడు తలపెట్టను. వాళ్ళు మిమ్మల్నెలా చూస్తున్నారు?"

సూటిగా కళ్ళల్లోకి చూశాడు ప్రకాష్—ఒకటి రె విముషాలు.

ప్రసాద్‌లో తనకి తెలియకుండానే ఏదో మార్పు-హిప్నటైజ్ చెయ్యబడుతున్నట్లు, హృదయం-సాధ్వీనం తప్పుతున్నట్లు, మనసు-తిరగబడుతున్నట్లు, రహస్యాల లోతులు—వెలికి వచ్చేస్తున్నట్లు.... ఏదో ఐపోతున్నట్లు....లొంగిపోతున్నట్లు.

"వాళ్ళు నన్నెలా చూస్తున్నారో నాకు తెలీదు. నిజంగా.... నాకు తెలీదు."

"అంటే వాళ్ళు మిమ్మల్ని గౌరవిస్తున్నారా? స్నేహంగా చూస్తారా? తేలిక పరుస్తారా?"

"అన్నీను....అంటాను. ఈ క్షణంలో అందల మెక్కిస్తారు. మరుక్షణం అధఃపాతాళానికి అణగద్రొక్కుతారు. ఒక క్షణం అభిమానిస్తారు. అంతలోకి అవమానిస్తారు. స్నేహంతో కౌగిలించుకుంటారు-హీనంగా విదిలిస్తారు. ఒకసారి సాటివాడిగా ప్రవర్తిస్తారు. మళ్ళీ సేవకుడిగా చూస్తారు. అంతా ద్వంద్వం. అయోమయం. అర్థం కాని తనం. స్వర్గమూ నరకమూ రెండూ చూపుతారు. అమృతమూ విషమూ రెండూ చిందిస్తారు. శిఖరాలూ లోయలూ రెండూ అనుభవింపజేస్తారు. వాళ్ళేమిటో, నేనేమిటో, నాకు వాళ్ళేమిటో, వాళ్ళకి నేనేమిటో—అంతా పజిల్. అర్థంలేని పజిల్. అవి బంగారు కత్తులు! తీయని బాధలు!ఏమో! నేను సరిగ్గా చెప్పలేను." ఉద్రేకంగా ఆవేశంగా ఊగిపోతూ చెప్పాడు హరి. అతని కన్నుల నిండా నీళ్ళు. కంఠం నిండా దుఃఖం. గుండెలనిండా వేదన. హృదయం నిండా పశ్చాత్తాపం....

"అక్కర్లేదు. ఒక్క విషయం సూటిగా చెప్పండి-మీరిక్కడ సుఖంగా ఉంటున్నారా?"

"సుఖం!" భారంగా నవ్వాడు. "నేను వచ్చింది సుఖాన్ని వెదుక్కుంటూ కాదు- ఉద్యోగం వెతుక్కుంటూ. అదీ కాక—నేను రావాలని రాలేదు. నా ధ్యేయం ఉద్యోగ సంపాదన."

"ఇక్కడ మీకు ఏమీ బాగులేనప్పుడు యింటికెందుకు

వెళ్ళిపోకూడదూ? తెలియనివారి, మీకేమీ కానివారి దూషణ భూషణ తిరస్కారాలు భరిస్తూ ఎందుకిక్కడ?"

"నిరుద్యోగి ఎక్కడయినా నికృష్ట జీవితమే. ఆపైన-ఆలోచించే మెదడుంటే అది మరీ శాపం. నిరుద్యోగి ఎక్కడున్నా అతని జీవితం అంతే! మా ఇల్లూ నాకు నరకంలాగే అనిపించేది. అక్కడి నుంచి ఎంత త్వరగా బయటపడతానా అని ముళ్ళమీదున్నట్లుండే వాడిని. ఓహ్! మీకు నా కథ తెలీదు కదూ? ఫర్లేదు-క్లుప్తంగా చెబుతాను. సాగదియ్యను. సిగరెట్ ఉందా?"

"మీకీ అలవాటూ ఉందా?"

"అయింది. వాళ్ళ స్నేహితుణ్ణయి ఉండి నేను సిగరెట్ కాల్చకపోతే వాళ్ళ కిన్సల్ట్ కదూ?

"సిగరెట్ ఇచ్చినందుకు థాంక్స్! ఇక కథలోకి-వ్యథలోకి వచ్చేస్తాను. రడీ! మా నాన్న నేను కాలేజీలో వుండగానే చనిపోయారు. ఉద్యోగి కనుక ఆయన తనతోనూ ఏమీ పట్టుకెళ్ళలేదు. మాకూ ఏమీ వదలలేదు. ఎలాగో నేను పట్టభద్రుడనై పట్టా పుచ్చుకుని భద్రంగా మా ఊరు చేరాను. అది పల్లెటూరు. పల్లెటూళ్ళో అయితే ఖర్చు తక్కువని అక్కడికి మకాం మార్చేసింది అమ్మ. రాబడి అంటూ ఏమీ లేదు. ఉండడానికి చిన్న కమ్మల ఇల్లు. అంతే మా ఆస్తి. అమ్మితే ఐదువందలయినా రాదేమో! నాకో చెల్లి వుంది. దానికి పెళ్ళీడు వచ్చింది. ప్రస్తుత సమస్య దాని పెళ్ళి కాదు. ఇంట్లో వాళ్ళ ఆకలి. అది తీరాలి. చదువుకుని వచ్చిన నావేపు అమ్మ వెయ్యి ఆశలతో చూసింది. న్యాయమే!

"సంసారంలో నేనొక్కడినే మగవాడిని. సంప్రదాయ ప్రకారంగా సంపాదించవలసిన వాడినీ, సంసారాన్ని నడిపించవలసినవాడినీ నేనే. అవి నాకు తెలుసు. బాధ్యతనుంచి తప్పించుకుందామనే పిరికితనం నాలో లేదు. ఇల్లెలా గడుస్తూందో నాకు తెలియదు. ఎప్పుడెప్పుడు అమ్మని ఆ బాధ్యతనుంచి తప్పిస్తానా అని ఆత్రంగా ఉద్యోగయత్నాలు చేయసాగాను.

"రోజులు గడుస్తున్నాయే తప్ప ఫలితం కనిపించడంలేదు. పైగా పల్లెటూరేమో, తెలిసీ తెలియని ప్రశ్నలు—'చదువుకునీ ఊరికే ఉండిపోయావేం?'- 'ఇంకా ఉద్యోగంరాలేదూ?' అమ్మమీద పడి తిన డానికి అభిమానమనిపించడంలా? సిగ్గులేదూ? ఇంతకంటె చదువు కోనివాడే నయం-కూలో నాలో చేసయినా కుటుంబాన్ని పోషించు కుంటాడు'- 'అన్నయ్యా! నీకుద్యోగం ఎప్పుడొస్తుంది? నాకు మంచి పరికిణీలు కుట్టించవూ?' ఎవరి ప్రశ్నకీ నా దగ్గర సమాధానం లేదు. కనిపించిన ప్రతి పోస్టుకి దరఖాస్తు పడెయ్యడం, పరీక్షకీ ఇంట ర్వ్యూకీ హాజరు కావడం-బాగానే చేయడం. తీరా చివరకి మొండి చెయ్యే.

"నాకు నిజంగా వెనుకదన్నులేదు. సిఫార్సు చేసేవాడులేడు. లంచమిచ్చుకోగలిగే స్తోమతలేదు. అయినా ఆశను చంపుకోకుండా నా ప్రయత్నాలు నేను సాగిస్తూనే ఉన్నాను. మనసుకి దెబ్బమీద దెబ్బ తగులుతూనే ఉంది. ఇంట్లో రెండో పూట భోజనం ప్రసక్తేలేదు. ఇన్ని జరిగినా నన్ను పల్లెత్తుమాట అననిది అమ్మ మాత్రమే. కాని ఆవిడ ముఖంలోకి చూసే ధైర్యం కూడా నాలో నశించి పోయింది.

"ఊరివాళ్ళ చూపులవీ మాటలనీ, ఎదుర్కోలేక గడపదాట డమే తగ్గించేశాను. నన్నో అసమర్థుడిగా-చేతకాని వాజెమ్మగా-చవటగా భావించి, వాడు చూసే హేళన చూపులూ, విసిరే ఎత్తి పొడుపు మాటలూ- నా మనసుని తూట్లు పొడిచి వదిలాయి. వాళ్ళకి వాస్తవం తెలియదు. ఉద్యోగమంటూ యివ్వాలే కాని అది ఎంత కష్టమయినదయినా చెయ్యడానికి నేను సంసిద్ధుణ్ణే.

"కష్టపడి చదివి వ్రాత పరీక్షలూ ఇంటర్వ్యూలూ బాగానే చేస్తున్నాను కాని ఉద్యోగంమాత్రం నాకందరాని పండే అవుతూంది. నా దురదృష్టానికి నాలో నేనే కుమిలిపోసాగాను. నేనెందుకూ కొర గాని వాడనేమో అని నాపై నాకే సందేహం కలిగేది.

"కాలంగడుస్తున్న కొద్దీ యింటి పరిస్థితి క్షీణిస్తోంది. నాలో ఆశ సన్నగిల్లుతోంది. నా అసమర్థత నన్ను తినెయ్యసాగింది. అమ్మ

ముఖం చూడాలంటే భయం. చెల్లెళ్ళి పలకరించాలంటే జంకు. వద్దు—వద్దు పగవాడికికూడా ఆ నరకం వొద్దు. ఆ బాధ వద్దు.

"ముఖ్యంగా పైవూరు వెళ్ళి పరీక్షవ్రాయడానికి అమ్మని డబ్బు అడగవలసి వచ్చేటప్పుడు లజ్జతో ఎంత కుంచించుకుపోయే వాడినో! ఊహించుకుందుకే భయంకరంగా ఉంది 'అమ్మా! యాదుసో జీతం' అని అందించవలసిన నేను, 'అమ్మా! ఉద్యోగ ప్రయత్నానికి డబ్బివ్వవూ?' అని అర్థించడం! ఏడుపు నెలా ఆపుకునేవాడినో! అలాంటి క్షణాలలో ఆత్మహత్య చేసుకుందామనిపించేది. నా బ్రతుకు నాకే నిరర్థకమనిపించేది. అమ్మకీ చెల్లెళ్ళకీ ఆధారంకాలేని నా బ్రతుకు వృధా అనిపించేది.

"నా ప్రయాణాలకు వారి దగ్గరా, వీరి దగ్గరా అప్పుచేసి డబ్బు తెచ్చేది. అమ్మ మంచిది కనుక అప్పుపుట్టేది. కాని 'నీ పెద్దికాసి ఎందుకు సుమతీ! యీ ఖర్చుకూడా? బోలెడంత డబ్బు పోసి చదివించావు. అందొస్తాడనుకున్నావు కాని, నీ కొడుకు ఏం అక్కరకు వచ్చాడు? తాంబూలంతో పాటు దక్షిణలా యీ ఖర్చుకూడా ఎందుకూ?' అనేవారు. ఆ మాటలు విని అమ్మ ఎంత బాధపడుతుందో ఊహించు కుని నాలో నేనే ఏడ్చుకునే వాడిని.

"అవకాశం అంటూ రావాలే కాని, మావాళ్ళ కోసం నేను ఏం చెయ్యడానికైనా సిద్ధమే. కాని అవకాశమే రావడంలేదు. మా అమ్మ కూడా నన్ను అసమర్థుడిగా జమకట్టేసిందేమో అన్న అనుమానం నన్ను నిలువునా దహించేసేది. ఎదుటివారి ఆశల బరువూ, కలల బరువూ మోయడం బహుకష్టమ్. ఈవూరు వొచ్చే ముందు దేవుడికి మొక్కుకున్నాను—యికనయినా నన్ని నిరుద్యోగప్పువైతరణి నుంచి గట్టెక్కించమనీ, నా ఆత్మవిశ్వాసాన్నింకా చంపెయ్యొద్దనీ. చదువు కయిన ఖర్చు అటుంచి ఉద్యోగ ప్రయత్నాని కయిన అప్పునేనా తీర్చగలనో-లేనో!

"ఉద్యోగం-అది చిన్నదయినా సరే, ఎటువంటి దయినా సరే! చిన్నప్పటి నుంచీ అలవాటులేదుకనుక కాయకష్టం చెయ్యలేను. అది

తప్పు ఏమయినా సరే- నేను నా ప్రయోజకత్వంతో సంపాదించాలి. అమ్మకి నా సంపాదన అందించాలి. చెల్లెకి పరికిణీకుట్టించగలగాలి. నా ఉద్యోగం నా కోసం కానేకాదు- అమ్మకోసం, అమ్మలోని నాపై ఆశకోసం. ఆమెలోని ఆ చివరి ఆశకూడా అంతరించిపోతే అమ్మ కూడా...." వెక్కి వెక్కి ఏడిచేశాడు.

ప్రకాష్ మౌనంగా ఉండి పోయాడు.

అతనికి తెలుసు- ఓదార్చబోతే దుఃఖం ఎక్కువౌతుందని. దుఃఖాన్ని కన్నీటిపే పొంపేసుకుంటేనే మనిషి-మనసూ తేలికపడతారు. అందుకే అతను ప్రసాద్‌ని అనునయించలేదు.

"ఇంటర్వ్యూ చేసివస్తూంటే ఆనంద్ కనిపించి పిలిచాడు. నిజంగా నాకు మా వూరికీ మాయింటికీ వెళ్ళాలని లేదప్పుడు. మా వాళ్ళన్నా మా వూరన్నా ప్రేమలేదని కాదు. ఆ పరిస్థితులలో అక్కడికి వెళ్ళాలంటే భయం-నర్వస్‌నెస్! అమ్మ ఆశగాచూస్తుందేమో! చెల్లి 'ఉద్యోగం నచ్చిందా' అని అడిగేస్తుందేమో! నిజానికి నాకు చాలా నమ్మకంగా ఉండేది ఆ ఉద్యోగం వస్తుందని. కాని రాలేదు!

"ఆనంద్ పిలిచిందే తడవుగా నే నతని ఆహ్వానాన్నంగీకరించాను. ఎందుకో చెప్పానుగా! ఆనంద్ నాకు స్నేహితుడు. అతని సహాయం నా కుంటుందని ఆశించాను. త్వరగా ఉద్యోగం వస్తుందనుకున్నాను. మిగిలిన బృందం కూడా మంచివారిగానే అనిపించారు. వాళ్ళు అందరూ మంచివారే. కాని అలా జరగడం నా దురదృష్టం. అంతే!

"ఏదెలా జరిగినా నే నిక్కడనుండి పట్టిచేతులతో యింటికి వెళ్ళదలుచుకోలేదు. నిరుద్యోగిగా నా ముఖం అమ్మకి చూపకూడదనే నిశ్చయించుకున్నాను. ఆత్మహత్యయినా చేసుకుంటాను కానీ, నా అసమర్థపు అవతారంతో అమ్మ ఎదుటపడను. అలా నా ముందు నేనే ప్రతిజ్ఞ చేసుకున్నాను. అందుకే ఎటువంటి అవమానం ఎదురయినా భరిస్తూనే వచ్చాను. నేను ఆలోచన పరుడినేకాను-సహనవంతుడిని కూడా."

"అంటే మీరు వాళ్ళని వదిలి వెళ్ళలేరన్నమాట!" జాలిగా అడిగాడు ప్రకాష్.

"ఉద్యోగం వచ్చి నా కాళ్ళమీద నేను నిలబడ గలిగేవరకూ అంతే! ఏమో ఆ శుభగడియంటూ ఉంటే అది త్వరగా వస్తే ఎంత బాగుండును. నేనిలాఅన్నానని-అభిమానరహితుడిననీ, సిగ్గులేనివాడి ననీ అనుకోకండి. నాకు పౌరుషం ఉంది. ఆత్మాభిమానం ఉంది. కాని వాటిని ప్రదర్శించుకునే అవకాశాలే రావడం లేదు. ఆ స్నేహితుల మాటలూ, ప్రవర్తనా అప్పుడప్పుడు నన్ను క్రుంగదీస్తాయి. కాని సహిస్తాను. ఎందుకో తెలుసా ప్రకాష్! జాగ్రత్తగా వినండి- నేనే మిటో వాళ్ళెవరికీ తెలియదు. మీ ఒక్కరికే తెలియబోతోంది. మీకు చెప్పకుండా ఉండలేకపోతున్నాను. నన్నేదో బలహీనత ఆవరిస్తూంది మీ ముందు.

"నా జీవితం యిక్కడికంటె మా వూళ్ళో మరీ ఘనంగా ఉండదు. అక్కడ నేను ఏకాకిని. ఎవరితో నూకలపలేను. మాయింట్లో రెండోపూట భోజనం ఉండదు. గంజిమాత్రమే తాగుతాం. నా కున్నవి రెండే రెండు జతలు. నేను కటికనేలమీదే పడుకుంటాను. ఆ పరి స్థితులతో పోలిస్తే ఇక్కడ నా జీవితం బాగా సాగుతున్నట్లే మరి. రెండు పూటలా తింటున్నాను. కాఫీలు టీలూ తాగుతున్నాను. సిగ రెట్లు కాలుస్తున్నాను. నావి కాకపోయినా కాస్త మంచి బట్టలే వేసు కుంటున్నాను. రోజు విడచి రోజు గెడ్డం గీసుకుంటున్నాను. పేపరు చదువుతున్నాను. ఉద్యోగస్థుల మాటలు వినగలుగుతున్నాను. ఇవన్నీ నా ప్రయోజకత్వంతో సాగిస్తున్నా నా అంటే-కాకపోవచ్చు. మొత్తానికి హాయిగా అనుభవించేస్తున్నాను కదా!"

"కాని—వాళ్ళు—మిమ్మల్ని...."

"నౌకరులా వాడుకుంటున్నారంటారు. అంతేనా? అదీ మంచిదే. నేను చేసే చాకిరీకి ప్రతిఫలంగా వాళ్ళు నాకీ సౌకర్యాలు కల్పిస్తూంటే-నేను వాళ్ళకెప్పుడూ ఏ విధంగానూ రుణపడి ఉండను. ఇక వాళ్ళప్పుడప్పుడనే మాటలు....వాటికేముంది! ఇదేమీ అమెరికా

కాదు-నౌకర్లని కూడా తమలాటి మనుషులుగా గుర్తించి గౌరవించేం
దుకు. నాకంటె ఎక్కువ అవమానాల పాలయ్యే నౌకర్లు చాలా మంది
న్నారు." చివరి మాటలనేటప్పుడు అతని గొంతు వణికింది. గుండె
భారంగా అయింది.

"ప్ర....సా....ద్!" లాలనగా అతని భుజం మీద చెయ్యి
వేశాడు ప్రకాష్.

"మరేమయినా చెప్పండి—వింటాను. కాని-నన్ను మా
వూరు-మా యింటికి పొమ్మని మాత్రం చెప్పకండి. ప్లీజ్! నేనా
పని చెయ్యలేను. నిరుద్యోగిగా మా అమ్మకు ముఖం చూపడం నా
తరం కాదు. అదీకాక...." ఒకసారి ఆగి-చాలా చేదు నిజం చెబు
తున్నట్లు మెల్లగా అన్నాడు- "అక్కడ-మా యింట్లో-నేను లేక
పోడంతో వాళ్ళకి కొంత బరువు తగ్గింది. నేను తినే తిండి-వాళ్ళకి
మిగులుతుంది. ఇది మాత్రం గుడ్డిలో మెల్లకాదూ! వాళ్ళకి మరి
కొంత అన్నం..."

"ప్లీజ్! ఆపండి ప్రసాద్!" వినలేకపోతున్నట్లు వారించాడు
ప్రకాష్.

"నా కథ మరీ చేదుగా ఉందా! బహుశా యీ దేశంలో యింత
కంటె చాలా చేదు కథల నిరుద్యోగులున్నారేమో ఎందరో! ఉండే
ఉంటారు."

ఇద్దరి మధ్యా కొన్ని నిముషాలు మౌనంగా గడిచిపోయాయి.

అప్పుడు-హఠాత్తుగా అన్నాడు ప్రసాద్-"చూడండి ప్రకాష్!
నా కథ విని-నాకు సెల్ఫ్‌పిటీ ఎక్కువనుకుంటున్నారేమో! అదేమీ
లేదు. నా చివరి ఆశాకిరణం వరకూ నేనీ బ్రతుకు పోరాటాన్నెదురుకుని
తీరతాను. పరిస్థితులు నన్ను సవ్యంగా బ్రతకనివ్వకపోతే పరిస్థితులకే
ఎదురు తిరుగుతాను. నాలోనూ మొండితనం ఉంది. పిల్లి-మామూలుగా
ఐతే మనిషికి దూరంగా పోతుంది. కాని-దాన్ని నాలుగు గోడలమధ్యా
బంధించి రెచ్చగొడితే! నేనూ అంతే! కొన్నాళ్ళు సహనం వహిస్తాను.
ఫలితం లేకపోతే బతకడం కోసం బందిపోటునో, హంతకుణ్ణో-ఏమ

యినా ఔతాను. ఐ-నా బ్రతుకు నేను బ్రతికి తీరతాను. నేను అస మర్ధుణ్ని కాను-అప్రయోజకుణ్ని కాను..."

"ఉద్రేకపడకండి. మీరు బండిపోటూ కానక్కరలేదు, మర్డరరూ కానక్కర్లేదు. బి. ఏ. చదివిన మీకు సవ్యమయిన మార్గంలో బ్రతుకు తెరువు కనిపించకపోదు. కాకపోతే-కాలం పెట్టే పరీక్ష. ఆఫ్‌కోర్స్-వొడ్డున ఉండి కబుర్లు చెప్పడం తేలికే. ఈదే వారికే తెలు స్తుంది ప్రవాహపు లోతు. ఒకమాట అడుగుతాను-ఆవేశపడరు కదా?"

"ఒకటేమిటి-వంద అడగండి. మీరు నన్ను వాళ జయించేశారు. నాలోని నన్ను బయటకు లాగి ప్రదర్శింప జేసేశారు. నేనెప్పుడూ ఎవరి ముందూ యిలాగ బయట పడలేదు. సరే-అడగండి."

"మీకు కావలసింది ఉద్యోగం. అది ఏదయినా చేస్తారా?"

"ఏదయినా అంటే?"

"మా ఆఫీసులో త్వరలో ఒక ప్యూన్ పోస్టు రాబోతూంది. మీరు గ్రాడ్యుయేట్. అందుకని ఆ ఉద్యోగం సూచించడానికి నాకు సంకోచంగానే ఉంది. కాని-మీ గురించి విన్నాక..."

"నిజంగా నాకా ఉద్యోగం వస్తుందా? ఏ రికమండేషనుతోనో, లంచమిచ్చో మరెవరూ ఎగరేసుకు పోరు కదా? ప్రకాష్-ప్లీజ్! నాకా జాబిప్పించండి. మీ రుణం మీ మేలు....ప్రకాష్! మీరు సాక్షాత్తూ దేముడే. నాకా ఉద్యోగం కావాలి. అత్యవసరం. మీరేం చెప్తే అది చేస్తాను. ప్రతిఫలంగా మీకు పర్సనల్ సర్వెంటుగా తీరిక వేళల్లో ఉంటాను ప్లీజ్—ప్రకాష్! నా కోసం, మా అమ్మ ముఖం చూసి ఆ పోస్టు నాకు వచ్చేలా చెయ్యరూ? అప్లికేషన్ రాసి తెచ్చేదా ఇప్పుడే? నాకు ఆ ఉద్యోగం చాలా అవసరం సార్! చాలా అవసరం. నన్ను— నన్ను కరుణించండి. మా కుటుంబాన్ని...మీ మేలు...."

"ప్ర....సా...ద్!" అరిచాడు ప్రకాష్.

అప్పటికే చాలా ఎక్సైట్ అయినట్లు ప్రసాద్ చెమటలు కారుతూ వాణికిపోతున్నాడు. ఒక్కసారిగా రక్తపు పోటు అధికమయిన వాడిలా

ఐపోతున్నాడు. గట్టిగా పట్టుకుని-సోడావాణ్ని పిలిచి-సోడా నీళ్ళు ముఖం మీద చిలకరించి-కొంచెం పట్టాక-తేరుకున్నాడు.

"నాకు ఫ్యూన్ పోస్టు! నిజమేనా?"

"నిజమే! అందుకు మీరు సందేహమూ పడనవసరం లేదు, ఆందోళనా చెందనక్కర్లేదు. పేరుకి ఫ్యూన్ పోస్టు కాని-చేయవలసింది అటెండర్ వర్క్. మా బాస్ మీలాటి వాడి కోసమే-అంటే-చదువుకున్న వాడి కోసమే చూస్తూంటే మీ గురించి చెప్పాను. అతను అంగీకరించి-మీ అంగీకారం తెలుసుకోమన్నాడు. మీరు కాదంటేనే మరొకరు."

"నేనా! కాదనడమా? ఉద్యోగం యిస్తానంటే కాదనడమా? నే నేమన్నా మూర్ఖుణ్నా?"

"గ్రాడ్యుయేటయి వుండి—ఫ్యూన్ పనికి..."

"అదీ లేని వాళ్ళెందరు లేరు? ఎందరు గ్రాడ్యుయేట్లు రిక్షాలు తొక్కడం లేదు? ఇంకెందరు పోస్టు గ్రాడ్యుయేట్లు బూట్ పాలిష్ చేసుకుని బ్రతకడం లేదు! వాళ్ళకి లేని కొమ్ములు నాకే మొలిచాయా? పదండి-మీ ఆఫీసర్ని కలుసుకుని-నా అంగీకారం...విన్నపం..."

"ఇవాళ ఆయనకు క్యాంప్. అదీకాక మీరు నిర్వర్తించవలసిన ధర్మం ఒకటుంది-మరచిపోకండి!"

"ఏమిటి? ఎంప్లాయ్‌మెంట్ ఎక్చేంజి నుంచి కాల్ లెటర్ ఏర్పాటుచేసుకోడమా? అయ్యో! వాళ్ళకి చెప్పించేందుకు..లేదా లంచం యిచ్చేందుకు....నాకేమీ..."

"అలాటి బాధేమీ లేదు. ఆ విషయం వదిలెయ్యండి."

"మరి!"

"ఈ వూళ్ళో మీకు గార్డియానూ, స్నేహితుడూ ఆనంద్ కదా! అతను మీ ఉద్యోగం కోసం ప్రయత్నిస్తానన్నాడు కదా! మరి-

అతని అనుమతి తీసుకోకుండా-అతనికి చెప్పకుండా-స్వతంత్రించి పూర్యాను పోస్టులో చేరితే మీ గురించి బాధపడదూ?"

"అదీ నిజమే! అతనికీ.... వాళ్ళకీ చెప్పాల్సిన విధి నా మీద ఉంది. అదెంత సేపు? ఇవ్వాళే-యిప్పుడే వెళ్ళి చెప్పేస్తాను. దరఖాస్తు పట్టుకుని ఎప్పుడు ఎక్కడికి రమ్మంటారు నన్ను?"

"రేపు నన్ను ఆఫీసులో కలుసుకోండి" అంటూ అడ్రస్ వ్రాసి యిచ్చాడు ప్రకాష్.

"ఏమిటో! జరిగినదంతా కలో నిజమో అర్థం కావడం లేదు."

"సహజమే! మీరు కొంచెం హిప్నటైజ్ చేయబడ్డారు. తలచిన దొకటయితే, జరిగినది మరొకటి. సరదాగా స్టడీ చేద్దామనుకుంటే చేదు నిజాలు బయటపడ్డాయి. ఇదీ ఒక విధంగా మంచికే వచ్చింది. కదూ?"

"ఔను-నాకు ఉద్యోగావకాశం లభించింది మరి!"

"నాకు పనుంది. ఇక వెళతాను. గుడ్ నైట్! రేపు మీ కోసం చూస్తాను. ఏం?"

"ఓ యస్-రేపు మిమ్మల్ని కలుసుకుంటాను."

ప్రకాష్ వెళ్ళిపోయాడు.

ప్రసాద్ మనసు ఆనందంతో తేలిపోతూంది.

'అక్కడెలా ఉన్నావో రాయి' అంటూ ఉత్తరం వ్రాయించింది అమ్మ.

'దానికేం జవాబు వ్రాయాలా?' అని ఆలోచించుకుందుకు బీచ్‌కి వచ్చాడు తను. ఆ ఆలోచనల లో 'హాపీ హెవన్' అనుభవాలన్నీ సినిమా రీలుగా తిరిగాయి. అమ్మకి నిజం చెప్పడమా-దాచడమా అని సందిగ్ధంలో పడ్డాడు.

ఇంతలో దేవదూతలా ప్రకాష్! కొంచెం బాధ పెడితే పెట్టాడు కానీ, చివరకు శుభమే జరుగబోతోంది.

జొను-గానుగలో నలిగి కానీ చెరకు కర్ర యిక్షు రసం కాదు.

గూటిలో బంధించబడిన అనంతరం కానీ అసహ్యమయిన గొంగళి అందమయిన సీతాకోక చిలుకగా పరివర్తన చెందదు.

కష్టపడితే కాని మనిషి అభివృద్ధి చెందడు. ఇది-ప్రకృతి సహజమేమో।

ఏమయినా తను నిరుద్యోగపు నైమిశారణ్యం నుంచి బయట పడబోతున్నాడు.

అందుకు వెంటనే తనకి తానే అభినందనలు తెలుపుకోవాలి. 'హాపీ హెవన్'కి వెళ్ళి యీ శుభవార్త చెప్పాలి. ఉత్సాహంగా లేచి బయలుదేరాడు.

# 6

శ్రీతని మనసు ఉల్లాసంగా ఉంది.

శరీరంలోకి కూడా నవోత్సాహం నిండినట్లుంది. అడుగులు చకచక పడుతున్నాయ్. అతను ఆనందంతో తేలిపోతున్నాడు.

త్వరలో తను ఉద్యోగి కాబోతున్నాడు.

అది-ఎటువంటిదయినా సరే। తను నిరుద్యోగి అవతారం చాలించేస్తున్నాడు.

ఇక తను పరాన్న భుక్కుగా బ్రతకనక్కరలేదు. తనని తాను పోషించుకోగలిగే స్వతంత్రుడూ, ప్రయోజకుడూ ఔతాడు. ఉద్యోగి అయ్యాక తనకీ నలుగురిలోనూ గౌరవం లభిస్తుంది.

పరిచయాలప్పుడు-ఖాళీగా ఉంటున్నట్లు చెప్పుకోనక్కరలేదు.

ఆ బాధ నుంచీ, శాపం నుంచీ తనకి విముక్తి లభించబోతోంది. తను మనిషిలా బ్రతికే అవకాశం వొస్తూంది.

అప్పుడు-జీవితాన్ననుభవించవచ్చు. ఆనందం పొందవచ్చు. ఇన్నాళ్లూ తను ఎంత దిగులు పడిపోయాడని! నిరుద్యోగి ఐనంత మాత్రాన కోరికలు ఊరుకోవుగా? తలలు బోడులయిన తలపులు బోడులౌ అన్నట్లు, పూటకి టికానా లేకపోయినా ఖరీదయిన కోరికలకు లోటుండేది కాదు.

తన యింట్లో తానే అతిథిగా ఉండే మొహమాటం పోయి-స్వతంత్రంగా తన తిండి తను తినాలి. మంచి అమ్మాయితో జీవితం పంచుకోవాలి. ఇవి-ఖరీదయిన కోరికలేమిటి? మగవాడికి—అతి సహజమూ, ప్రాథమికమూ అయినవి కావూ?

కాని-నిరుద్యోగిగా వీటి నుంచి కూడా దూరమై ..సరే! ఇక ఆ గడచిపోయిన అధ్యాయం దేనికి?

ఉద్యోగం రాగానే చిన్న యిల్లు తీసుకుని-అమ్మనీ, చెల్లినీ రప్పించి-తన యింట్లో తానుంటాడు.

అప్పుడు అమ్మ ముఖం చూడడానికీ, ఆమెతో మాట్లాడ్డానికీ బిడియ పడనవసరముండదు.

"ఉద్యోగస్తుడి వయ్యావుగా! మంచి పిల్లను చూసి పెళ్ళి చేస్తా" నంటుందమ్మ. సగ్గునటిస్తూ తల ఊపుతాడు. తనకి చాలా అందమయిన మంచి అమ్మాయితో వివాహం ఔతుంది.

ఆమెతో తన కోరికలు తీర్చుకుంటూ-సుఖంగా జీవిస్తాడు. అది స్వర్గమే! స్త్రీ సుఖం కోసం తనెంత వెంపరలాడుతున్నాడో! నిరుద్యోగి కనుక కానీ, లేకపోతే ఏనాడో వివాహం చేసుకుని ఉండేవాడు.

పాపం-నిరుద్యోగి! అతని యవ్వనం కూడా అడవి పాలే. తనకా గండం తప్పింది-తప్పుతోంది.

కీచుమంటూ శబ్దం-చెవుల దిరిపోయేలా, గుండె చెదరిపోయేలా.

"బ్రతకాలనిలేదేమిటి? వాళ్ళు దగ్గర పెట్టుకుని నడుప్. బండి కింద పడి మమ్మల్ని చంపకు." చివాట్లు వేసి వెళ్ళిపోయాడు.

నిరుద్యోగిగా తను చావాలని చాలా సార్లనుకున్న మాట నిజమే కాని, యిక తనకి జీవించాలనే వుంది. స్వతంత్ర జీవనం-శ్రీ సుఖం అన్నీ లభించబోతూంటే-తనెందుకు చస్తాడు? అలాటి మూర్ఖుడు కాడు తాను.

* * *

ప్రసాద్ అడుగు పెట్టేసరికి- 'హాపీ హెవన్' ప్రశాంతంగా ఉంది.

ఎవరూ లేరేమో అనుకున్నాడు.

న్యూస్ చెబుదామని ఆత్రంగా ఆనందంగా తను వస్తే— యిదేమిటని నిరుత్సాహ పడుతూనే చూశాడు.

అన్నట్లు యివాళ ఫస్టుతారీకు. జీతాలందే రోజు. కనుక అందరూ బిజీగా ఉంటారు. షాపింగు, సినిమా, బారూ-ఏదో ఒకటి.

ఆనంద్‌గది తాళంవేసి ఉంది. రఘుమాత్రం రూములోనే ఉన్నట్లున్నాడు.

"రఘుగారూ!"

"ఏమిటి విశేషం-చాలా వెలిగిపోతున్నారు?" నవ్వాడు.

"నాకుద్యోగం వచ్చింది. వొస్తూంది—తప్పకుండా రాబోతూంది...." తడబడ్డాడు.

"కంగ్రాట్స్! ఎయిత్ వండరంత హడావిడి చేస్తున్నారు."

"నా ఉద్యోగం నా కెనిమిదో వింతే మరి!"

"ఇంతకీ ఏ డిపార్టుమెంటు? ఏం పోస్టు?"

"ప్యూన్ పోస్టు."

"ఆఁ!" ఆశ్చర్యమూ, జాలీ ఒక్కసారే ప్రదర్శించి- "ప్యూనా! ఐ పిటీ యూ" అన్నాడు.

"పిటీ దేనికి?" నీరసం వచ్చేసింది ప్రసాద్‌కి.

"మూడేళ్ళు సాము చేసి మూలనున్న ముసలి ముండను కొట్టినట్లు గ్రాడ్యుయేటయిఉండి బంట్రోతు పనిలో చేరితే జాలి కాక మరేమిటి?"

"బ్రతకడానికేదో ఒకటి. దీని కయినా ఎందరు నోచుకుంటున్నారు?"

"మీరు చేరేందుకే గట్టిగా నిశ్చయించేసుకుంటే నేనేమీ చెప్పలేను కానీ, ఆలోచిస్తానంటే ఓ మాట అంటాను. అదీ స్నేహితుడిగా నా విధి అనుకుంటాను."

"చెప్పండి!" భయంగా అడిగాడు ప్రసాద్.

"పెళ్ళిలాగే ఉద్యోగంకూడా. వేసిన అడుగు వెనక్కి తీసుకోలేం. అందుచేత ముందే జాగ్రత్తగా విదానంగా ఆలోచించుకోవాలి. ఉద్యోగంలో చేరిపోయాక మరో దాని లోకి మారిపోడం అతికష్టమూ మహాకష్టమూ. ఓ ఉద్యోగంలో తల దూర్చేశాక మరో దానికి తయారయ్యేందుకు తీరికా ఉండదు, ఓపికా ఉండదు. కనుక చేరేటప్పుడే జాగ్రత్తగా ఆలోచించుకోవాలి. అందులోనూ మీ క్వాలిఫికేషనుకి ప్యూను పోస్టంటే చాలా ఘోరమూ, అన్యాయమూ. మీలాటి తెలివయిన వాడు ప్యూను పోస్టులో జాయినైపోతాడంటే జాలివేస్తుంది కానీ, ఎలా అభినందించగలను? మీరు బంట్రోతు అయితే మీకే కాదు-గ్రాడ్యుయేట్స్ అందరికీ అవమానమే."

"నిరుద్యోగంకంటె బంట్రోతు పనయినా బాగేకదా? నా పరిస్థితి మీకు తెలుసు."

"ఆల్‌రైట్! నేను చెప్పవలసింది నేను చెప్పాను. ఆ పైన

మీ యిష్టం. అన్నట్లు....నా నవలకి మూడో బహుమతి వచ్చింది. కమ్యూనికేషన్ వచ్చింది."

"కంగ్రాచ్యులేషన్స్! అంత సీరసంగా చెప్పారేం యింత మంచి వార్త?"

"దురదృష్టం! మొదటి బహుమతి వస్తుందనుకున్నాను. సెకండ్ కూడానా రాలేదు."

"బహుమతి వొచ్చింది. సంతోషించ దగినదే కాదా?"

"మీకు తెలీదు-అదెంత మంచి నవలని! దానికి ఫస్ట్ ప్రయిజు రాక పోడం...."

ప్రసాద్ ఎదురు చూశాడు- ఫెయిర్ చేసినందుకు థాంక్స్ చెబుతాడేమో అని.

ఊహుఁ! ఆ సంగతే మరచిపోయినట్లున్నాడు రఘు. ఎవరో వచ్చినట్లయితే బయటకు నడిచాడు. శంకర్!

"నాకు ఖ్యానుద్యోగం దొరకబోతూంది శంకర్‌గారూ!" అన్నాడతని గదిలోకి వెళ్ళి.

అతను ప్రసాద్ ముఖంలోకి అదోలా చూసి ఏదో స్ఫురించి నట్లయి-ముఖం మాడ్చుకుని, "పోలీసు దెబ్బ కొట్టారు! ఖరేనా చీ అన్నారు" అన్నాడు.

"ఏమిటి?" అర్థంకానట్లు కంగారుగా చూశాడు ప్రసాద్.

"మామీద మీకు పూర్తిగా నమ్మకం పోయిందనేగా మీ మాటలకు అర్థం? మీరు సామాన్యులు కారు. మెత్తగా బుద్ధి చెప్ప గలరు. ఏం చేసేది? మరీ తప్పని సరయి మీకు బదులు మోహన్ని ఆ లీవ్ వేకెన్సీలో వేయించాను. మోహన్ మీ కంటె ముందు నుంచీ తెలిసినవాడు. సరిగ్గా సమయానికి వచ్చి కాళ్ళా వేళ్ళా పడ్డాడు. కాదన లేక పోయాను. నిజానికదే న్యాయం కూడా! త్వరలో మీకు చూద్దా మనే అనుకుంటున్నాను. కాని మీరు నన్నపార్థం చేసుకుని మిన్ ఫిట్టనే

స్తున్నారు. సరే—నేను చేయగలిగే దేమీ లేదిప్పుడు. మిమ్మల్ని బంట్రోతుగా వేయించమంటే ఆదేశాన్ని చేసి ఉండేవాడిని. మీ రింత దిగ జారతారని నే ననుకోలేదు. మీకు కనీసం గుమాస్తా పోస్టయినా వేయించాలనుకున్నాను ఆల్‌రైట్‌! అలాగే కానివ్వండి. తెలియక, అనుభవంలేక మీరు నికృష్టమయిన బంట్రోతు పనిని మహా రాజయోగంగా భ్రమిస్తున్నారు—భ్రాలో ఉన్న దంతా కషీజమే అన్నట్టు. కాని ప్రాస్టిట్యూట్ బాడీకాగే ప్యూన్ పోస్టుకూడా వాట్టి ఫాల్సీ అని త్వరలోనే తెలుసివచ్చి ఓ సలాం కొట్టవచ్చేస్తారు.

"ప్యూను పనంటే ఏమిటి? కాగితాలు మొయ్యడం, కాఫీ లందించడం, కప్పులు కడగడం, ఎవరొచ్చినా చేతులు కట్టుకోడం, కాళ్ళరిగేలా తిరగడం. మీరు గ్రాడ్యుయేటని ఆఫీసరే మి ముద్దు చెయ్యనూ చెయ్యరు, నెత్తి కెక్కించుకోనూ ఎక్కించుకోరు. ఆఫీసు బంట్రోతంటే 'హపీహెవెన్'లో మెంబర్ల మధ్యలాగ అనుకోకండి."

ప్రసాద్‌కి పేమీ వినిపించడంలేదు.

శంకర్ మాటలలో బయల్పడిన దారుణ మయిన చేదు నిజమే అతన్ని విషపు ముల్లులా గుచ్చుకుని సలుపుతూంది.

అవకాశం వచ్చినా తనకోసం దాన్ని వినియోగించలేదు శంకర్. లీవ్ వేకెన్సీలో మరెవరినో వేయించాడు.

అంటే - ఆనాటి మాటలు ఒట్టి గాలిమాటలే అన్నమాట! నిజంగా తను వీళ్ళకేమీ కాడు. తనకంటే ఎవరో ఎక్కువ వాడూ అప్పుడూ అయిపోయాడు ఉద్యోగావకాశం వచ్చేసరికి.

ఇటువంటి మనుషుల్నా తను నమ్మాడు? వీళ్ళనా స్నేహితు లని భ్రమించాడు? వీళ్ళకా తను సకల సేవలూ చేసింది? వీళ్ళనా- తనను సర్వెంటులా చూసినా క్షమించి గౌరవించింది?

"ఓహ్! మీరిక్కడున్నారా? ఆఫీసులో ఎవరూ లేరేమో అను కున్నాను. ఒక్కడికీ టీ తాగబుద్ధికాక కంపెనీ వెదుక్కుంటూ.... రండి-రండి" అంటూ వచ్చాడప్పారావ్.

"ఆఫీసులో పార్టీ అయింది. నే నివ్వాళ టీ తాగను" అన్నాడు శంకర్.

"మీరు రండి ప్రసాద్!"

అతని వెంట కదిలాడు. మెస్‌లో టీ తీసుకుంటూ, "నాకు ప్యూనుద్యోగం వచ్చేలా ఉంది" అన్నాడు ఏ మాత్రమూ ప్రత్యేకంగా కాకుండా మామూలుగా అన్నట్లు.

"ఈడ్చి తన్నండి వెధవ జాబ్‌ని. సింహం ముసలిదయినా ఎండుగడ్డికి కక్కుర్తి పడుతుందా? గ్రాడ్యుయేట్ నౌకరుపనికి పాల్పడతారా? ఆఫర్ చేసిన వాడికి బుద్ధుండాలి. నో-మీరు ప్యూనయితే ఆ అవమానం మీకే కాదు, మాకూను. మా ప్రిస్టేజ్ ఆలోచించండి. అది కూడా మీ విధే. మా ఫ్రండ్ ఓ ఆఫీసు ప్యూనని చెప్పుకుందుకు-మాకు చాలా బాధగా ఉంటుంది. అదీకాక బంట్రోతుకి ఇక్కడ జీవితమేమీ సుఖంగా సాగదు. ఓ పూటయినా తినగలడో లేడో! ఏ విధంగా చూసినా-ప్యూన్-అన్‌వాంటెడ్ పోస్టే మీకు." కుందేం కర్మ-బిందే పగల గొట్టినట్లు-తన మాటకి తిరుగులేనట్లు చెప్పేశాడప్పారావు.

బ్రాహ్మడూ నల్లమేకా కథలా ఉంది ప్రసాద్ పరిస్థితి.

ఎవరి నడిగినా ప్యూన్‌పోస్టు వద్దనే అంటున్నారు.

ఆనందేమంటాడో?

ప్రకాష్ చెప్పినట్లు అతని మాటే ముఖ్యం తనకి.

ఆనందేమంటాడో? ఏ గూటి చిలక ఆ గూటి పలుకే పలుకుతుందట.

ఆఫీసరయిన ఆనంద్‌కి ప్యూన్‌పోస్టు ఆనుతుందా?

అతనూ వద్దనే అంటే తనేం చేయాలి?

ఉద్యోగం వస్తుందన్న ఆనందం లేకుండా చేసేశారు వీళ్ళ ముగ్గురూ.

ఇక ఆనంద్?

ఆలస్యంగా వచ్చాడు ఆనంద్.

భోజనం చేశాక మెల్లగా చెప్పాడు—"నాకు ప్యూన్ పోస్టు దొరికేటట్లుంది."

"ఏ....మి...టీ?"

"అవును. ఓ స్నేహితుడిప్పిస్తానన్నాడు."

"ఎవరా స్నేహితుడు? నాకు తెలియని వాడు?"

"........."

"చూడు ప్రసాద్! నన్నవమానించటానికి నీ కింతకంటే మరో మార్గమేదీ తోచలేదా?"

"ఆ....నంద్! నా ఉద్దేశ్యం...."

"నాకంతా తెలుసు. మెత్తని చెప్పుతో కొడుతున్నట్లు నువ్వెందుకిలా చేస్తున్నావో నాకు తెలుసు. బాగా తెలుసు." ఆనంద్ ముఖం కందగడ్డ అయింది.

"నువ్వనే దేమిటి?" అర్థం కానట్లు చూశాడు.

"అమాయకత్వం నటించకు. మనిషెప్పుడూ తన గురించి మాత్రమే ఆలోచించుకుంటూ ఉండకూడదు. ఎదుటివారి గురించి కూడా యోచిస్తుండాలి."

"నేను—నేనేం చేశాను?"

"రోజీ తమ్ముణ్ణి రికమెండ్ చేయించాననేగా నీకు ఉడుకుమోతుతనం?" ఆగి- "నీకు నిజం తెలియదు. రోజీ చాలా పేద కుటుంబం నుంచి వచ్చింది. ఆమె మంచి జీవితాన్ని కోరుకుంటూంది.

ఆమె-వర్కింగ్ గర్ల్ అయినా అట్టే సుఖపడలేక పోతూంది. ఆమె సంపాదన అంతా ఇంటి ఖర్చుకే అయిపోతూ ఆమెకు ఏమీ మిగలడంలేదు. ఈ విషయాలన్నీ ఆమె నాకు చెప్పి బాధపడింది. తన తమ్ముడికి ఉద్యోగం వస్తే తను సుఖపడగలనంది. ఆమె కన్నీరు నన్ను కరిగించేసింది. ఆమె మాటలు నా మనసుకి హత్తుకు పోయాయి. అందుకే నీకు వాగ్దానం చేసిన రికమెండేషన్-ఆమె తమ్ముడికి చేశాను. అది తెలిసి—నువ్వు నన్నిలా సాధించబోతున్నావ్।"

యావత్ప్రపంచమూ గిర్రున తిరుగు తున్నట్లనిపించింది ప్రసాద్‌కి.

బ్యాంక్ ఏజంట్ క్యాండిడేటుగా తనని పరీక్షకు కూర్చోబెడతానన్న ఆనంద్—తనకి బదులు-రోజీ తమ్ముణ్ణి కూర్చోబెడుతున్నాడు. ఇంతవరకూ ఈ విషయమే తనకి తెలియదు।

పుచ్చకాయల దొంగ సామెతను నిజం చేశాడు ఆనంద్।

ఇంతవరకూ తనకి తెలియని రహస్యం చేదుగా బయట పడింది. తనకిస్తానన్న అవకాశాన్ని రోజీ తమ్ముడి కిచ్చేశాడు ఆనంద్।

అతనిమీద తనెన్ని నమ్మకాలూ, ఆశలూ పెట్టుకొన్నాడు। ఎంతగా నమ్మాడు। అన్నిటినీ అబద్ధం చేసేశాడు ఆనంద్।

అతనికి—తన కంటె రోజీ తమ్ముడే ఎక్కువ కావలసిన వాడై పోయాడు। ఆనంద్-స్నేహితుణ్ని ఓవర్‌లుక్ చేసెయ్యగలిగాడు.

ఎంత చేదు నిజం।

ఆలి వంకవారు ఆత్మ బంధువులని సామెత।

ఆలి కాని-ప్రియురాలి వంకవారు-స్నేహితుడి కంటె అధికులని నిరూపించాడు ఆనంద్।

తను మోసపోయాడా?

స్నేహాన్ని నమ్మి-తను ఓడిపోయాడా?

స్నేహంలో అరమరికలుండవనీ-స్వార్థానికి తావుండదనీ' మైత్రి-పవిత్ర గంగా వాహిని అనీ ఊహించుకున్నాడు తను.

అదంతా భ్రమేనా?

స్నేహాన్ని తను అమాయకత్వం కొద్దీ అనుభవం లేకా అ... కంటె అధికంగా అంచనా వేసుకున్నాడా?

తప్పు తనదేనా?

కయ్యానికీ వియ్యానికీ లాగే నెయ్యానికీ సమానత్వం అవసరమా?

సాటివారి మధ్యే తప్ప సవ్యమయిన స్నేహం తీవెలు సాగదా?

సమాజంలో లాగే స్నేహానికీ—వర్గ విభేదమూ అంతరమూ తప్పదా?

వ్యవస్థ ప్రభావం స్నేహం మీదా ప్రసరించి కలుషితం చేయక మానదా?

ఇంతేనా?

"నువ్వేం నిశ్చయించుకున్నావు?" సూటిగానే అడిగాడు ఆనంద్.

తలవంచుకుని మెల్లగా అన్నాడు హరి—"ప్రస్తుతం నా పరిస్థితి దృష్ట్యా—దొరికిన ఉద్యోగంలో చేరడమే మంచిదను కుంటున్నాను."

విసురుగా అన్నాడు ఆనంద్-"సరే-నీ యిష్టమే కానియ్. నువ్వు తెలివయిన వాడివనుకున్నాను. ఆలోచించగలిగే శక్తి ఉందను కున్నాను. తొందరపాటు మనిషివనుకోలేదు. చివరి మాటగా చెబు

తున్నాను-నువ్వు తొందరపడి బంట్రోతు ఉద్యోగంలో చేరి అనక విచారిస్తే-అందుకు నేనేమీ బాధ్యుణ్ని కాను."

మౌనంగా ఉండిపోయాడు ప్రసాద్.

ఆనంద్ తనని కొంచెమూ అర్థం చేసుకోడేం?

తన పరిస్థితి-ముందు నుయ్యి, వెనుక గొయ్యి అన్నట్లే ఉంది అచ్చంగా.

వీళ్ళందరూ తనని భయపెడుతున్నారు-ప్యూన్‌గా చేరవద్దని.

పరిస్థితులేమో-'ఏదో ఒకటి-ముందీ నిరుద్యోగ నరకం నుంచి బయట పడు' అంటున్నాయి.

తనేం చెయ్యాలి?

ప్యూన్ పోస్టు నంగీకరించడమంటే వీళ్ళనందరినీ వదులు కోడమే.

తను బంట్రోతుగా చేరాక-'హాపీ హెవన్'కి అన్ని విధాలా దూరమవక తప్పదు.

పోనీ, వీరి మాటలు విని వచ్చిన అవకాశాన్ని చేజార్చు కుంటే-మళ్ళీ ఏ అవకాశమయినా వస్తుందో రాదో?

అదృష్టం ఒక్కసారే తలుపు తడుతుంది.

అప్పుడు ఆహ్వానించకపోతే అది మరెన్నడూ రాదని చదివాడు తను.

అది నిజమే ఔతుందేమో?

ఈ విషమసంధిలో-ఏం చెయ్యాలి? ఏం చెయ్యాలి?

కనీసం ఆనందేనా-'ముందు చేరు. తరువాత మంచి పోస్టు కోసం చూడొచ్చు' అని ఉంటే ఎంత బాగుండేది!

నిజంగా తను దురదృష్టవంతుడు. కాకపోతే-రాకరాక వచ్చిన

ఉద్యోగావకాశం-సంతోషింప జెయ్యకుండా-యిలాటి పరీక్ష కెదురు చేస్తుందేం?

ఓ చెంప మీద దెబ్బ-మరో చెంప మీద ముద్దు-సరిగ్గా అలాగే ఉంది పరిస్థితి.

ఈ పరిస్థితిలో తనెలాటి నిర్ణయం తీసుకోవాలి?

ఎవరు చెబుతారు?

ఆc-రేపు-ప్రకాష్‌నే అడిగితే సరి! అదే నయం! అతను చాలా తెలివయిన వాడిలా-మంచివాడిలా ఉన్నాడు.

తన సమస్యను అతని ముందుంచితే సరి.

అలా అనుకున్నా చాలా రాత్రికి కానీ నిద్ర పట్టలేదు ప్రసాదుకి.

# 7

"నేను చెప్పేవి కొంత చేదుగానూ, కఠినంగానూ, వినడానికి బాధ గానూ ఉంటాయి. ఏం చేసేది? నా కెదురయిన జ్ఞానం అటు వంటిది. ప్రతి మనిషిలోనూ యిగో ఉంటుంది. దానికి చాలా రకాల దాహాలుంటాయి. మీ స్నేహితులూ అంతే! ఓ నిరుద్యోగికి ఆశ్రయం యివ్వడంలో వారి అహం కొంత సంతృప్తి చెంది వుంటుంది."

"అంటే-తమ యిగోని తృప్తి పరిచేందుకే అన్నమాట నన్ను ఆదుకున్నది?"

"ఔను. అది పట్టి మానసిక సంతృప్తంతే! మీ కివ్వవలసిన ఉద్యోగావకాశాన్ని మరొకరి కెందుకు యిచ్చారంటే...."

ఆసక్తిగా చూస్తున్నాడు ప్రసాద్. ప్రకాష్ చేస్తున్న సైకో అనాలిసిస్ అతనికి చాలా నచ్చుతోంది.

"అక్కడ మెటీరియల్ బెనిఫిట్ చాలా ఎక్కువ. చాలా లాభాన్ని పోగొట్టుకోవలసి వచ్చినప్పుడు-యిగో తాలూకు పీక నొక్కేశారు. మరో కోణం కూడా వుంది. మీరక్కడ వారి మధ్య అలా ఉంటూంటేనే వారి అహం సంతృప్తి చెందుతుంది."

"ఎలా?"

"మనుషుల మనస్తత్వం చిత్రమయినది. ఒక విధమయిన థీరీ ఆఫ్ రెలిటివిటీ మానవ మనస్తత్వానికి వర్తిస్తుంది. పోల్చి చూసుకోవడం మనుషుల కలవాటు. ఎదుట వాడి కంటె తను ఘనంగా ఉండాలి. నలుపు మీదనే కదా తెలుపు కనిపించేది? గోడ మీద సుద్దతో గీస్తే ఏమీ కనపడదు. అదే నల్లబల్ల మీద అయితే ప్రస్ఫుటంగా కనిపిస్తుంది. మనిషి ప్రయత్నమూ యింతే!

"తను ప్రకాశించడానికి—బ్యాక్ గ్రౌండుని డల్ చేస్తాడు సూటిగా. మీరు నిరుద్యోగి కనుక-వాళ్ళకి తమ ఉద్యోగం ఓ విధ మయిన గర్వానిస్తుంది. నిరుద్యోగిని చూస్తే చిరుద్యోగికి, చిరుద్యోగిని చూస్తే గురుద్యోగికీ- యిలాటి ఆధిక్యతా భావమే కలుగుతుంది. మనసు చల్లగా ఉంటుంది.

"ఐతే- యీ విషయం అనాలిసిస్ ఆతనికి తెలియక్కరలేదు. ఎంత మాత్రం తెలియక్కర లేదు. బ్యాలెన్స్ అన్న మాట కాపీ దాని అర్థం కాపీ తెలియని పల్లెటూరు వాడు సైకిలు తొక్కగలగడం లేదూ? అలాగే! సైకిలు మెకానిజమూ, బ్యాలన్స్ గురించీ తెలియ కుండానే అతనెలా సైకిల్ తొక్కగలుగుతున్నాడో- అలానే సైకో అనాలిసిస్ తెలియక పోయినా మీ మిత్రులు యీ విధమయిన ఆనందం పొందగలుగు తున్నారు."

అర్థం చేసుకోగలిగిన ప్రసాద్‌కి మతి పోయింది.

చిన్న గీతను పెద్దది చెయ్యాలంటే- దాన్ని ముట్టుకో నక్కర లేకుండా- ప్రక్కనే చిన్న గీతను గీస్తేచాలు. తను-ఆ రెండోగీత- చిన్న గీత.

వాళ్ళు తనవల్ల పెద్ద గీతలు.

అంటే-తను వాళ్ళకి వొట్టి ఆటబొమ్మ. తను వెళ్ళిపోతే వాళ్ళకు ఫన్ ఉండదు. ఇగో....తృప్తి వుండదు.

అందుకేనా అందరూ ఒకే మాటగా తనని వెళ్ళొద్దన్నారు.

వాళ్ళని నమ్ముకుంటే ఎండమావి వెంట పరుగే।

ఈసారికి రోజీ తమ్ముడు, మరోసారి మేరీ మేనల్లుడు తన అవకాశాన్ని కబళించెయ్యరని నమ్మక మేమిటి?

జాగ్రత్తగా ఆలోచిస్తూంటే యిప్పుడంతా సుస్పష్ట మౌతూంది.

మొదట—వారికి తను స్నేహితుడే ఏమో కాని, క్రమక్రమంగా తను- తనని వాళ్ళు సర్వెంటుని చేసేశారు.

మళ్ళీ అది తనెక్కడ కనిపెట్టేసి వెళ్ళిపోతాడో అని తమ చర్యలకు స్నేహపు పూత పూసేవారు.

అలాగ తననక్కడ కట్టి పడెయ్యడమే వారి ఉద్దేశమేమో।

ఔను. అది బంగారు గోడల జైలు.

స్నేహ పూర్వకంగా కనిపించే ఉరి. తాడులా కనిపించే పాము.

"మరి స్నేహం—సృష్టిలో తీయనిదనీ, అతి విలువైనదనీ అంటారు. బంధువుల కంటె స్నేహితులే ఆప్తులంటారు. అవన్నీ అబద్ధాలేనా?"

ప్రసాద్‌వి చూస్తూ జాలిగా నవ్వాడు ప్రకాష్—"మీ బాధనీ మీలో జరుగుతున్న సంఘర్షణని నేను అర్థం చేసుకోగలను. మీకు నా సానుభూతి. నేనేమీ సర్వజ్ఞుణ్ని కాను. నా జ్ఞానం సమగ్రమూ సంపూర్ణమూ కాదు. నాకు తోచేదేమిటంటే-రాబర్ట్ బ్రౌనింగ్ అన్నట్లు ఇలాతలంమీద పరిపూర్ణత అనేది ఉండదు. పరిపూర్ణత అంటే దైవత్వమే. అందుకే మానవత్వం ఎప్పుడూ ఎందులోనూ సాధించవలసింది మిగిలే ఉంటూంటుంది.

"స్నేహం తీయనిదే కావొచ్చు. కాని దీనిలోనూ చిరుచేదు ఉంటుంది. స్నేహానికీ సరిహద్దులుండి తీరతాయి. బట్టతలకీ మోకాటి చిప్పకీ ముడిపడనట్టే-స్నేహం కూడా ఏ నేలలో పడితే ఆ నేలలో మొలకెత్తేసే గింజకాదు.

"స్నేహం విషయంలోనూ, ఏ విషయంలోనూ మనిషి పరిపూర్ణత వంక ప్రయాణించగలడే తప్ప జీవితకాలంలో దానిని సాధించలేడు. అందుకే ప్రేమలో లాగే స్నేహంలోనూ అంతో ఇంతో స్వార్థం తప్పదు. మీరు ప్లాట్‌ఫామ్‌మీద ఉండి రైల్లో వెళ్ళే వాడితో స్నేహం చేద్దామంటే ఎలా కుదురుతుంది? కొన్ని సుఖాల లాగే స్నేహానికీ అంతో ఇంతో అంతస్తులతో ప్రమేయముంటుంది. నేను స్నేహాన్ని కించపరుస్తున్నాననుకోకండి. మీ మనసుని మలినపరచడమూ, మీ స్నేహితులనుంచి దూరం చేయడమూ నా అభిమతం కాదు. నాకు తెలిసిన నిజం- మిమ్మల్నేమన్నా ఉద్ధరిస్తుందేమో అని. అంతే!"

"థాంక్స్ ప్రకాష్‌గారూ! ఒక ప్రశ్న వేస్తాను. దయచేసి చెబుతారా?"

"ఏమిటి? అడగండి! తెలిస్తే చెప్పడానికేం కష్టపడాలి?"

"నేను మీకు కొంచెం పరిచయస్తుణ్ని మాత్రమే. కాని మీరు నాకు ఉద్యోగం ఇప్పిస్తున్నారు...."

నవ్వాడు ప్రకాష్-"నా యిగోని తృప్తిపరచడానికి."

నమ్మలేనట్లు చూశాడు ప్రసాద్-"నిజం చెప్పండి."

"మిమ్మల్నిక్కడ చూసినప్పటినుంచీ, నా ఎదుటనే వాళ్ళు మీతో ప్రవర్తించిన తీరు గమనించినప్పటినుంచీ, మీ గురించి ఆలోచిస్తూనే ఉన్నాను. అంటే-మీరు నా సబ్జక్టయ్యారన్నమాట. డాక్టరుకీ పేషంటుకీ మధ్యలాగ మన మధ్య మానసికంగా సంబంధం బలపడుతూ వచ్చింది. దానివి పురస్కరించుకుని-నాకు మీ మీద ఏర్పడిన జాలి కొద్దీనూ-ఇంకెవరూ లేక మీకీ ఆఫరిచ్చాను. దీన్ని మీరు త్యాగమనో మరేదో అనో పెద్ద పెద్ద మాటలతో వర్ణిస్తే-నాకు నవ్వొస్తుంది."

చిత్రంగా చూసి-తాను తెచ్చిన దరఖాస్తు సంతకంచేసి ఇచ్చేశాడు ప్రసాద్.

"చూడండి! మీ నిర్ణయాన్ని నేను హర్షిస్తున్నాను. కూలిన గోడలు మళ్ళీ లేవలేక పోవు. నేటి ప్యూన్ రేపటి ఆఫీసరు కావచ్చు. కథలలోనే-కాదు వాస్తవ ప్రపంచంలోనూ కష్టేఫలి. నీతికీ, నిజాయితీకీ, పరిశ్రమకీ తప్పకుండా ఫలం దొరుకుతుంది. వర్క్ ఈజ్ వర్షిప్! విష్ యూ బెస్టాఫ్ లక్! బహుశా ఎల్లుండి మీకు అప్పాయింట్‌మెంట్ ఆర్డరు వస్తుంది. ఎదురుచూస్తూండండి."

"థాంక్స్!"

ప్రకాష్ దగ్గర శలవు తీసుకున్నాడు ప్రసాద్.

## 8

'హాపీహెవన్' మెస్ లో అందరూ చేరారు.

చూడబోతే అక్కడ చిన్న పార్టీ జరగబోతున్నట్లుంది.

డైనింగ్ టేబులు చుట్టూ కుర్చీలు ఒక్కటీ ఖాళీ లేకుండా నిండుగా ఉన్నాయి.

ఆనంద్।

అప్పారావు।

శంకర్।

రఘు।

ప్రసాద్।

సత్యనారాయణ।

టిఫిన్ ప్లేట్లు వొచ్చాయి.

ప్రసాద్ విలుచున్నాడు. "మైడియర్ ఫ్రండ్స్। ఇవాళ నాకు చాలా సంతోషంగా వుంది. నా సంతోషంలో మీరూ పాలు పంచుకోగలరనే భావిస్తాను. మీ సాంగత్యం నా జీవితాన్ని మలుపు తిప్పింది. ఇక్కడకు వచ్చి-సీతో పాటు గడపబట్టే నాకు ఉద్యోగం దొరికిందని భావిస్తున్నాను. ఈ 'హాపీ హెవెన్' నా అదృష్టరేఖను మార్చింది. ఇన్నాళ్ళకి నా కలలు పండాయి. ఆశలు నెరవేరాయి.

"మీ అందరికీ నేనంటే చాలా అభిమానం. అందుకే యిన్నాళ్ళూ నన్ను మీలో ఒకడిగా భావించి పోషించారు. అందుకు మీకేనాటికీ కృతజ్ఞుడినే.

"నేను ప్యూన్ పోస్టులో చేరడం మీకు నచ్చదని తెలిసి కూడా ఎందుకు చేరానంటే పరిస్థితులటువంటివి. దయచేసి—మీరు అర్థం చేసుకోగలరు. నా మీద కొన్ని బాధ్యతలున్నాయి. వాటిని నెరవేర్చాలని నాకు తహతహగా వుంది."

పేకాటకి వేళ మించి పోతూందని కొందరికీ, మరో ప్రోగ్రామ్‌కి వేళ ఐపోతూందని కొందరికీ తొందరగా వుంది. ఆ విసుగు ముఖాలలో కనిపిస్తూనే వుంది.

"చిన్న యిల్లు తీసుకున్నాను. రేపు వెళ్ళి మా అమ్మనీ చెల్లినీ తెచ్చుకుంటాను. ఈ మాత్రం వొడ్డు చేరగలిగినందుకు నాకెంతో

ఆనందంగా వుంది. నా ఆనందాన్ని ప్రకటించుకుందుకే యీ పార్టీ ఏర్పాటు చేశాను. మీ తాహతుకి తగిన పార్టీ కాదని నాకు తెలుసు. ఇది నా శక్తికి తగిన పార్టీయే. మీ అందరి ఆశీర్వాదాలూ, శుభా కాంక్షలూ నా కుంటాయని ఆశిస్తాను."

"దానికేం?" అన్నాడు అప్పారావు.

పార్టీ పూర్తయింది.

చీకటి పడుతోంది.

అందరూ లేచారు—సిగరెట్లు కాలుస్తూ.

"అప్పుడప్పుడూ వొస్తూంటారుగా?"

"వొస్తాను" బయటకు అలా అన్నాడు కాని, అతని ఉద్దేశం వేరు.

'వొస్తాను-ప్యూన్‌గా మాత్రం కాదు. నా అదృష్టంబాగుండి నా కృషి ఫలిస్తే ప్యూన్‌గా కాకుండా ఏ గుమాస్తాగానో వొస్తాను.

'నాకు తెలుసు. అప్పుడు నన్ను మీలో ఒకడిగా చూసుకో గలరు. నన్ను స్నేహితుడిగా భావించగలరు. నన్ను చూపి గర్వ పడగలరు.

'అప్పుడు మీరు నన్ను దయతో కాక స్నేహంతో చూస్తారు. ఆ క్షణం కోసమే నేను ఎదురు చూస్తాను. కృషి చేస్తాను.'

"మమ్మల్ని మరచి పోరు కదా?"

'మిమ్మల్ని మరచి పోవడమా? సాధ్యమేనా?

మీరు నన్ను ఆదరించారు-

అవమానించారు.

స్నేహితుడిలా చూశారు-

సేవకుడిలా చూశారు.

అన్నం పెట్టారు.

అహం మీద దెబ్బ కొట్టారు.

నవ్వించారు. ఏడిపించారు.

దగ్గరగా తీసుకున్నారు.

దూరంగా విసిరి కొట్టారు.

మీలో కలుపు కున్నారు.

విడిగా ఉంచారు.

నన్ను ఉక్కిరి బిక్కిరి చేశారు.

ఏం జరుగుతూందో నా కర్థం కానంత అయోమయంలో ఉంచారు.

అన్నీ భరించాను.

అంతకంటే చెయ్యగలిగిందేమీ లేదు.

అనుకోకుండా వచ్చా ఇక్కడికి.

ఆశ రేగింది.

అవసరార్థం ఉన్నాను.

అవసరం తీరింది. ఆనందంగా వెళ్తున్నాను.

నాతోపాటు కొన్ని అనుభవాలను వెంటపెట్టుకొని మరీ వెళ్తున్నాను.

కొన్ని తీపి నిజాలూ, మరికొన్ని చేదు సత్యాలు,

స్నేహాన్ని గురించి చాలా తెలుసుకో గలిగాను. అర్థం చేసుకోగలిగాను. జీవితాంతం జ్ఞాపకం వుంచుకోవలసిన అనుభవాలివి. పీటివి....'

"మరచి పోగలనా!" అర్థవంతంగా నవ్వాడు ప్రసాద్.

అందరూ గేటు వరకూ వచ్చి-"గుడ్ లక్!" చెప్పారు.

పేరు పేరునా 'థాంక్స్' చెప్పి, కరచాలనం చేసి—గేటు దాటాడు ప్రసాద్.

చీకటి చిక్కబడుతోంది.

'హాపీ హెవెన్' సభ్యులు లోపలికి వెళ్ళిపోయారు.

భారంగా అడుగులు వేస్తున్న ప్రసాద్ ఒక్కసారి ఆగాడు.

అతనికి ఒక్కసారి వెనక్కి తిరిగి చూడాలనిపించింది.

అంతలోనే వొద్దనిపించింది.

ఎటూ తేల్చుకోలేనట్లు నిలబడిపోయాడు.

వెనక్కి లాగుతున్న అనుబంధం—వొద్దంటున్న చేదు అనుభవాలు.

అలాగే నిలబడి పోయాడు ప్రసాద్.

అక్కడ ఎటువంటి అనుభవాలు ఎదురయినా- వాళ్ళు తన స్నేహితులు.

తీయని స్నేహాన్ని రుచి చూచి అనుభవించాడు-చేదు అనుభవాలతోపాటు.

ఆ చిన్న నిజం హెచ్చరించినట్లవడంతో- అతను యింకేమీ ఆలోచించకుండా వెనక్కి తిరిగి చూశాడు.

'హాపీ హెవెన్' అక్షరాలు మెరుస్తున్నాయి దీప కాంతిలో.

తృప్తిగా చూసి- కదిలాడు ప్రసాద్.

స్నేహానికి- సృష్టిలో అమిత తీయనిదయిన స్నేహానికీ సరిహద్దులున్నాయి.

వాటి నధిగమించేందుకు తను ప్రయత్నిస్తాడు.

స్వార్థంతో మలినం కావడం వల్ల తనకి స్నేహం అటు తీయని ఫలాల్నీ యిటు చేదు ఫలాలనీ యిచ్చింది.

తప్పు వాళ్ళదే కాదు—తనదీని.

ఆ మిత్రులు మంచివాళ్ళే!

పరిస్థితులటువంటివి మరి!

ఇందులో ఎవరి నేరం మాత్రం ఏముంది?

అతని గుండె బరువు తగ్గి, హాయిగా ముందడుగు వేయగలిగాడు.

—: సమాప్తం :—


## కృతజ్ఞతలు

'నవలంటే మనస్తత్వ చిత్రణ' అని సూచించిన ఓ సాహితీ వేత్తకీ, ఈ నవలలో ప్రధాన పాత్ర తాలూకు మనస్తత్వాన్ని కూలంకషంగా పరిశోధించడానికి నాకు చాలా సహకరించిన మిత్రుడు శ్రీ జి. యు. బి. శర్మ (బాంక్ ఆఫ్ ఇండియా, అనకాపల్లి)కీ, కొత్త తరహా నవలలు కోరుతామన్న కొందరు అభిమాన పాఠకులకీ నా కృతజ్ఞతలు.

—ఇచ్ఛాపురపు రామచంద్రం

## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA133M138 |
| పుస్తకం పేరు | విజయ |
| తారీఖు | 31/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 79 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| | NO |
| తయారు చేసినది | Soumya |
| పేజీలు విడదీసినది | Sowmya |
| Scan | Ch. Ramya |
| పరీక్ష చేసినది | HASEEMA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |